మాహుక కవి విరచితా

# హారమేఖలా

## ( ప్రయోగమాలా )


అనువాదకులు :

**తిరుమల రామచంద్ర**

**వేటూరి శంకరశాస్త్రి**



ప్రచురణ

## గోపాలాచార్లు, లక్ష్మీపతి మెమోరియల్ ఆయుర్వేద శాస్త్ర పరిశోధక మండలి

**గాంధీనగర్, హైదరాబాద్-500 380**

గోపాలాచార్లు, లక్ష్మీపతి మెమోరియల్ ఆయుర్వేదశాస్త్ర పరిశోధక మండలి
ప్రచురణ సంఖ్య : 3
ప్రథమ ముద్రణం : 1000 ప్రతులు
సంవత్సరం : 1986
మూల్యం : రూ. 50–00

ఈ గ్రంథం తిరుమల తిరుపతి దేవస్థానంవారి
ఆర్థిక సాహాయ్యంతో ముద్రింపబడింది.
వారి సాహాయ్యానికి కృతజ్ఞతలు.

ముద్రణ : విప్ల ప్రింటర్స్
చిక్కడపల్లి, హైదరాబాదు–500 020.
ఫోన్ నెం. : 66242.

ప్రతులకు :
గోపాలాచార్లు, లక్ష్మీపతి మెమోరియల్
ఆయుర్వేదశాస్త్ర పరిశోధక మండలి
'శ్రీవత్స', 1-1-770/4,
గాంధీనగర్, హైదరాబాద్–500 380.
ఫోన్ : 6 6 0 4 7

# ప్రస్తావన

"కాలో హి నామ భగవాన్ అనాదినిధనః." ఆది మధ్యాంత రహితమైన కాలమే పరమేశ్వర స్వరూపమని అగ్నివేశ మహర్షి అన్నాడు. మానవుడు కాల వాహినిలో మునకలు వేస్తూ, పురుషకార మనే పేరుతో ఏవేవో చేయవలెనని సంకల్పిస్తూ ఉంటాడు. అవన్నీ నెరవేరాటంటే కాలం కలిసి రావాలి. అనగా భగవదనుగ్రహం ఉండాలి.

హరమేఖలా (ప్రయోగ మాలా) అనే ఈ గ్రంథం నా చేతికి వచ్చి చాల కాలమైంది. విద్వత్సం స్తవనీయులు వాసిరెడ్డి దుర్గా సదాశివేశ్వర ప్రసాద్ (వి. డి. ఎస్. ప్రసాద్) గారు అప్పటి తిరువాన్కూరు ప్రభుత్వం వారి యాజమాన్యాన శ్రీ చిత్రోదయ మంజరి 136 వ ప్రచురణగా ప్రకటితమైన ఈ గ్రంథం తెప్పించారు. వారు కొంతవరకు ఈ గ్రంథం పరిశీలించి, ఇందలి ప్రయోగాలు కొన్నింటిని తెలుగుకు అనువదించి ఆంధ్రప్రభ దిన పత్రికలో (1959) ప్రకటించారు. ఇది కేవలం వైద్య గ్రంథం కావడం వల్ల, ప్రాకృత భాషలో రచిత మయినందున ప్రజల కందరికీ తెలియడం మంచిదని నా చేతి కిచ్చి తెలుగులో అర్థాలు వ్రాసి ప్రకటించడం మంచిదని సలహా యిచ్చారు. ఆ రోజులలో నా సంపాదకత్వాన ముక్త్యాల నుండి ప్రకటింపబడుతూ ఉండే "శ్రీధన్వంతరి" పత్రికకు ఈ గ్రంథాన్ని గురించి ఒక వ్యాసం ఇవ్వమని నేను కోరగా, వ్రాసి ఇచ్చారు. దానిని "శ్రీధన్వంతరి" పత్రిక సంపుటి 22 సంచిక 12 (1959 నవంబర్) లో ప్రకటించాను. ఆ వ్యాసంవలన ఈ గ్రంథాన్ని గూర్చిన ఉదంతం అంతా సవిస్తరంగా చదువరులు గ్రహించగలరు. (దానిని ఈ ప్రస్తావనానంతరం ప్రచురిస్తున్నాను.) దానిని చదివిన చాల మంది వైద్యులు ఆ గ్రంథం కావాలని కోరుతూ జాబులు వ్రాశారు. అందుమీదట ఈ గ్రంథాన్ని ఆమూలాగ్రం చదివి ప్రకటిద్దామనే అభిప్రాయంతో కొంతవరకు తెనుగున వ్రాశాను. ప్రాకృత భాష నాకు తెలియదు. సంస్కృతంలో వ్యాఖ్యానం ఉన్నా, కొన్ని పట్టుల ప్రాకృతానికి సంస్కృత వ్యాఖ్యకూ భేదాలు పొడసూపినవి. కొన్నిచోట్ల అన్వయం కుదరడంలేదు. ప్రాకృత

భాషా పండితుల సాహాయ్యం ఉంటేగానీ తెనుగున వ్రాయడం మంచిది కాదని సందేహించాను.

ఈ గ్రంథాన్ని మాహుక కని ప్రాకృత భాషలో రచించాడు. ఆ ప్రాకృత కారికలకు సంస్కృతచ్ఛాయ, వ్యాఖ్యానం ఎవరు రచించినదీ తెలియదు. చాల తప్పులతోను గ్రంథపాతాలతో ఉన్న దీనిని అప్పటి తిరువాన్కూరు పండితులు సాంబశివ శాస్త్రిగారు అతి కష్టం మీద ఒక దారికి తెచ్చి ముద్రించారు. అయినా, కొన్నిచోట్ల ప్రాకృతకారికలకు, సంస్కృతచ్ఛాయాశ్లోకాలకూ పొందిక కుదరడం లేదు. వ్యాఖ్యానాన్ని అనుసరిద్దామంటే కొన్నిచోట్ల వ్యాఖ్యానం కూడ అందీ పొందకుండా ఉంది. ఇన్ని సందేహాలతో తలొక దారిలోను ఉన్న ఈ గ్రంథాన్ని ప్రాకృతభాష రాని నేనొకడినే కూర్చుని తెలుగర్థం వ్రాయబూనడం సాహసమే అవుతుంది. అదృష్టవశాత్తు ప్రాకృత భాషాకోవిదులైన శ్రీ తిరుమల రామచంద్ర గారి సాహాయ్యం లభించింది. కొంత ఆలస్యమయినా, సాధ్యమైనంతవరకు ఈ గ్రంథాన్ని ఒక తీరుకు తెచ్చి ప్రకటించదలచాను.

తెలుగర్థం సందర్భ శుద్ధిగ వ్రాయడంలో కొన్ని తికమకలు తప్పలేదు. ఉదా:- సంస్కృతంలో ఉన్న ఓషధి పేరును తెలుగులోకి అనువదించవలసి వచ్చినప్పుడు, ఆ ఓషధీ వాచకపదానికి తెలుగులో వివిధ నామాలు ఉదాహరింపబడి ఉంటాయి. అనువాదకుడు ప్రకరణవశాత్తు సందర్భ శుద్ధిని అనుసరించి ఏదో ఒక ద్రవ్య నామాన్ని ఎన్నుకోవలసి ఉంటుంది. అది ఆమోద యోగ్యంగా ఉండాలి కదా! ఇక గ్రంథంలో ఉన్న గ్రంథపాతాలు సరేసరి. కొన్నిటిని వ్యాఖ్యను బట్టి పూరించడానికి ప్రయత్నించాము; కొన్నిటిని పూరించక ఉన్నవి ఉన్నట్లు ఉంచాము.

ద్వితీయ పరిచ్ఛేదం ఎత్తుగడలోనే రోతగా, బూతుగా ఏవగింపు కలిగించేవి గాను, అపాయకరమని తోచేవిగాను కొన్ని యోగాలు ఉదాహృతమయ్యాయి. గ్రంథకర్త కుంటెనకత్తెలను, వేశ్యలను దూషిస్తూ, వారిమీద విరుచుకుపడ్డాడు. వారికి ప్రాయశ్చిత్తాలు చెప్పాడు.

ఇట్టి అపాయకరమైన ప్రయోగాలు గల గ్రంథం ప్రాకృతంలోను, సంస్కృతంలోను ఉంటే కొందరికే అర్థమవుతుంది గాని, తెలుగులోకి వచ్చేసరికి బహుజనావబోధమై, దుర్వినియోగపడి బాధాకరమవుతుందేమోననే భయం నాకు కలుగకపోలేదు. అట్టి దానిని తెలుగులో వ్రాయడం మంచిదో కాదో అనే సందేహంలో పడ్డాను. లోతుగా ఆలోచించగా, ఇట్టి ప్రయోగాలు చాలా వాత్స్యాయనుని కామసూత్రాలలోను, కూచిమారతంత్రం, మదనానంద మొదలయిన గ్రంథాలలోను కానవచ్చినవి. మరిన్ని బృహత్త్రియాది వైద్యగ్రంథాలలో వాజీకరణాధ్యాయంలో కూడ ఇట్టి ప్రయోగాలు ఉన్నవి. అతిప్రాచీనకాలంనుంచి ఇట్టి ప్రయోగాలు గ్రంథస్థమై ఉన్నట్లు సాక్ష్యాధారాలు లభించాయి. ఉదాహరణకు వ్యాసప్రోక్త సంస్కృత భారతంలోను, కవిత్రయ రచిత శ్రీమదాంధ్రమహాభారతంలోను, పురాణాలలోను, ప్రబంధాలలోను కానవస్తున్నవి.

(1) వ్యాసరచిత సంస్కృత భారతంలో అరణ్యపర్వంలో, ఏకోన నవత్యధిక శతతమాధ్యాయంలో ఇలా ఉంది:

సత్యభామా:-

> కేన ద్రౌపది వృత్తేన పాండవానుపతిష్ఠసి,
> లోకపాలసమాన్ వీరాన్ నిత్యం పరమసమ్మతాన్.
> కథం చ వశగాస్తుభ్యం న కుప్యంతి చ తే శుభే,
> తవ వశ్యా హి సుభృశం పాండవాః ప్రియదర్శనే.
> న చాన్యోన్య మసూయంతే కథం వా తే సుమధ్యమే,
> ముఖప్రేక్షాశ్చ తే సర్వే తత్త్వ మేతత్ బ్రవీహి మే.
> వ్రతచర్యా తపో వా పి స్నానమంత్రౌషధాని చ,
> విద్యావీర్య మూలవీర్య జపహోమాస్తథా గదాః.
> మమాప్యాచక్ష్వ పాంచాలి రహస్యం భగవేతనమ్,
> యేన కృష్ణే భవేన్నిత్యం మమ కృష్ణో వశానుగః.

ద్రౌపదీ :-

> అసత్స్త్రీణాం సమాచారం సత్యే మామనుపృచ్ఛసి,
> అసదాచరితో మార్గః కథం స్యాదనుకీర్తనమ్.

అనుప్రశ్నః సంశయో వా నైష త్వయ్యుపపద్యతే,
కథం హ్యపేతబుద్ధ్యా త్వం కృష్ణస్య మహిషీ ప్రియా.
యదైవ భర్తా జానీయాన్మంత్రమూలపరాం స్త్రియమ్,
ఉద్వేజతే తదైవాస్యాః సర్పా ద్వేశ్మగతాదివ.
ఉద్విగ్నస్య కుతశ్శాంతిః అశాంతస్య కుతస్సుఖమ్,
న జాతు వశగో భర్తా స్త్రియస్స్యాన్మంత్రకారణాత్.
అమిత్రవిహితాశ్చాపి నిర్యాస్తత్ర సుదారుణాః,
మూలప్రవాదేన విషం ప్రయచ్ఛంతి జిఘాంసవః.
జిహ్వయా యాని పురుషం త్వచా వా ప్యుపసేవతే,
తత్రచూర్ణాని దత్తాని హన్యుః క్షిప్రమసంశయమ్.
జలోదరసమాయుక్తాః శ్విత్రిణః పలితా స్తథా,
అపుమాంసః కృతాః స్త్రీభిః జడాంధబధిరా స్తథా.
పాపానుషండాః పాపస్థాః పతీ నుపసృజంత్యుత,
న జాతు విప్రియం భర్తుః స్త్రియా కార్యం కథంచన.
వర్తామ్యహం తు యాం వృత్తిం పాండవేషు మహాత్మసు,
తాం సర్వాం శృణు మే సత్యం సత్యభామే యశస్విని.
అహంకారం విహాయాసం కామక్రోధౌ చ సర్వదా,
సదారాన్ పార్థివాన్ నిత్యం ప్రయతోపచరామ్యహమ్.
ప్రణయం ప్రతి సంగృహ్య నిధాయాత్మాన మాత్మని,
శుశ్రూషుర్నిరభీమానా పతీనాం చిత్తరక్షిణీ.

పై శ్లోకాలకు సంగ్రహానువాదంగా కవిత్రయం తెలుగు భారతంలో గల పద్యాలివి. శ్రీమదాంధ్రమహాభారతం, అరణ్యపర్వం, పంచమాశ్వాసం, సత్యాద్రౌపదీ సంవాదం:

చ. అలయక మంత్రతంత్ర వివిధౌషధభంగులఁజేసి యెంతయున్
వలతురు నాథు లంట మగువా కడుఁబేలతనంబు దాన మున్
గలిగిన ప్రేమయుం బొలియుఁగాని యొకండును సిద్ధిఁబొందద
ప్పొలఁతుకతోడి మన్కి యహిపొత్తుగఁజూచు విభుం డెఱింగినన్.

చ. మదువ యొనర్చు వశ్యవిధి మందులుమాకులు నొండుచందమై
మగనికి దెచ్చు రోగములు మానక మూకజడాది భావముల్
యొగిన్గొనరించు నద్దురితముల్ దనచేసినచేతలై తుదిన్
జగమునవెక్కి నిందయును సద్గతిహానియు వచ్చు నింతికిన్.

వశీకరణాది యోగాలు ప్రయోగించడం వల్ల కలిగే రోగాలు తెలుపుతూ, ఈ వశీకరణ ప్రయోగాలు నిష్ఫలమనీ, ప్రేమ అనే ఒక్క వశీకరణయోగం వల్లనే ఇతరులను వశపరచుకోవచ్చునని సత్యకు ద్రౌపది ఉపదేశించినట్టు పై ఉదాహరణ వల్ల తెలుస్తున్నది.

ఇవేగాక రాజులను వశపరచుకొనడానికి, దుర్మార్గులైన ప్రభువులను చంపడానికి ఆహార పానీయాలలో విషం పెట్టడమే కాక విషకన్యలనే భోగినులను శత్రురాజుల వద్దకు పంపి ప్రాణహాని కలిగించడం కలదని చరిత్ర చెబుతున్నది.

అంతేకాక, హరమేఖలా గ్రంథంలోని ప్రయోగాలు మనం కల్పించినవి కావు. ఉన్నవి ఉన్నట్లు ప్రకటించడంలో తప్పేమీ లేదని నిశ్చయించుకొన్నాను. ఇంతకు నేను చెప్పదలచిన దేమంటే, ఈ గ్రంథం ద్వితీయ తృతీయ పరిచ్ఛేదాలలోని ప్రయోగాలు దురుద్రేక వశులయిన కొందరు యువతీ యువకులకు ఆకర్ష చేయంగా కనిపించగలవు. పుస్తకంలో ఉంది కదా అని, మంచి చెడ్డలు ఆలోచించక స్వతంత్రించి, దుర్వినియోగపరచి వాటివల్ల కలిగే అపాయాలను, ఉపద్రవాలను ఎదుర్కోవద్దని, ప్రయోగ కుశలులైన వారివల్ల వాటి గుణదోషాలు తెలుసుకొని ప్రయోగించడం మంచిదని హెచ్చరిస్తున్నాను.

"ప్రత్యక్షతో హి యద్దృష్టం శాస్త్రదృష్టం చ యన్మయా,
సమాసతస్తదుభయోః భూయో జ్ఞాన వివృద్ధయే,
అభ్యాసాత్ప్రాప్యతే దృష్టిః కర్మసిద్ధిప్రకాశినీ,
రత్నాది సదసజ్జ్ఞానం న శాస్త్రాదేవ జాయతే"

(అ. హృ. సూ.)

ఈ శ్లోకార్థాలను గ్రహించి జాగ్రతగా వాడుకోవాలని మరొకమారు సూచన. పై విషయాలన్నీ సమాలోచించిన మీదట ఇవి బహు ప్రాచీన కాలం

నుంచి ఉపయోగంలో ఉన్నవేనని, ప్రస్తుతం వీనిని తెలుగులో ప్రకటించడం వలన కొత్తగా కలిగే హాని ఏమీ ఉండబోదని చదువరులు గ్రహించగలరు.

లోకంలో నీతి అవినీతి, ధర్మం అధర్మం ఉంటాయి; వాటికి సంఘర్షణ ఎప్పుడూ జరుగుతూనే ఉంటుంది.

"ఆచార్యః సర్వచేష్టాసు లోక ఏవ హి ధీమతః,
అనుకుర్యా త్తమేవాతః లౌకికేఽర్థే పరీక్షకః".

(అ. హృ. సూ. 2.44)

బుద్ధిమంతునికి సర్వ కార్యాలలోను లోకమే గురువుగా ఉండగలదు. లౌకిక వ్యవహారాలలో జాగ్రతగా మెలగుతూ విషయ పరిశీలన జరిపి లోకాన్నే అనుసరిస్తూ ఉండాలి.

"సుఖార్థాః సర్వభూతానాం మతస్సర్వాః ప్రవృత్తయః,
సుఖంచ న వినా ధర్మః తస్మాద్ధర్మపరో భవ."

లోకంలో సర్వభూతాల సకల ప్రవృత్తులు సుఖంకోసమే. ఆ సుఖం ధర్మరహితంగా ఉండనేరదు. కనుక మానవుడు ధర్మపరుడై మనుగడ సాగించాలి.

## గ్రంథకర్త

ఈ హరమేఖలా గ్రంథకర్త అయిన మాహుకుడు కేవలం వైద్యుడేకాక కామశాస్త్రోపాధ్యాయుడుగాను, మంత్ర తంత్ర విద్యాపారంగతుడుగాను కాన వస్తున్నాడు. ఈ గ్రంథంలోని ప్రయోగాలన్నీ దేశమంతా తిరిగి అప్పుడు వాడుకలో ఉన్న ప్రక్రియలన్నిటినీ సేకరించి గ్రంథస్థం చేసినట్టు కనబడుతుంది. పూర్వపు కొందరు సంస్థానాధీశులవద్దను, ప్రసిద్ధ వైద్య కుటుంబాలలోను 'చిటకా' అనే పేర కొందరు వైద్యులు సేకరించి వ్రాసుకొన్న యోగాల పుస్తకాలు దొరుకుతున్నవి.

నేటి నాగరికులు ఈ గ్రంథంలోని ప్రయోగాలు చూచి ఇవన్నీ మూఢ నమ్మకాలనీ, అనాగరకు లాచరించే ఘోర దురాగతాలనీ అనవచ్చు.

కాని, ఏదైనా ఒక ద్రవ్యం ఉన్నప్పుడు దానికి గుణకర్మ లంటూ ఉండక తప్పదు. అవి మంచివి కావచ్చు, చెడువి కావచ్చు. లోకప్రవృత్తి కూడ ధర్మాధర్మాలతో, నీత్యవినీతులతో కూడి ఉన్నది గదా! నీతివల్ల, ధర్మాచరణవల్ల సుఖ శాంతులు; అవినీతి, అధర్మాలవల్ల దుఃఖాశాంతులు, మరిన్ని అరాచకం కలుగుతాయనే మాట తథ్యం. శాంతి సౌఖ్యాలు కోరే మానవుడు ధర్మాచరణవల్ల సుఖ శాంతులతో మనుగడ సాగించగలడు. అది లేనినాడు అంతా దుఃఖ భాజనమే అవుతుంది.

నాగరికత పెరిగి వివేకం వర్థిల్లుతున్నదని చెప్పడమేకాని, లోకప్రవృత్తి చూడగా, మనుష్యుల మధ్య ఈర్ష్యాద్వేషాలు పెరిగి, దేశాలు దేశాలు నాగరికత పేరుతోనూ, శాస్త్రాభివృద్ధి అనే నెపంతోను అణ్వస్త్రాలను సృష్టించి, మారణ హోమానికి సిద్ధమవుతున్నవి. ఇదేనా మన నాగరికతా లక్షణం? కాబట్టి మానవుడు సాధించిన ప్రగతిని, తెలుసుకొన్న విషయాలను లోక కల్యాణానికే తప్ప లోకాన్ని ధ్వంసం చేయడానికి ఉపయోగించకూడదు.

ఈ గ్రంథస్థ విషయాలన్నీ మానవాళి ఆరోగ్యాన్ని, అభ్యుదయాన్ని కోరి చెప్పినట్టివయినందున, వీటిని సద్వినియోగపరచుకొని శాంతి సౌఖ్యాలు పొందగలరని ఆశిస్తున్నాను.

## కృతజ్ఞత

ఈ గ్రంథాన్ని ప్రచురించడంలో అనారోగ్యవంతుడనైన నాకు సర్వ విధాల సహాయపడిన పరార్థ ప్రాపకులైన సజ్జనులు డా॥ బి. రామారావు (అసిస్టెంట్ డైరెక్టర్, ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ హిస్టరీ ఆఫ్ మెడిసిన్, హైదరాబాద్) గారికి నా కృతజ్ఞతాపూర్వకమైన అభినందనలు తెలుపుతున్నాను. నాకు రామారావుగారితో గల మైత్రి చాలా గాఢమైనది. బాంధవ్యంకంటె మైత్రీభావన చాల గొప్పదని వారిని నేను సంభావిస్తూంటాను. ఆ విధంగానే సహాయపడిన డాక్టర్ శ్రీమతి తిరుమల హరిణి, ఎం.డి., గారికి, శ్రీమతి పద్మజ, ఎం.ఏ. గారికి నా కృతజ్ఞతాపూర్వకమైన అభినందనలు తెలుపుతున్నాము.

గోపాలాచార్లు, లక్ష్మీపతి మెమోరియల్ ఆయుర్వేద శాస్త్ర పరిశోధక మండలి గౌరవాధ్యక్షులుగా ఉన్న డాక్టర్ దండా వెంకట సుబ్బారెడ్డిగారు రు. 1116-00 లు విరాళమిచ్చారు. వారికి కృతజ్ఞతలు.

వేంకటేశ్వర ఆర్ష భారతి ట్రస్ట్ సంస్థాపకులు శ్రీ పల్లంపాటి వేంకటేశ్వర్లు గారు, ట్రస్ట్ విద్వాంసులు కల్లూరి వేంకట సుబ్రహ్మణ్య దీక్షితులుగారు మా కృషిని ప్రోత్సహిస్తునందుకు కృతజ్ఞతలు తెలుపుకొంటున్నాను.

ఈ గ్రంథ ప్రచురణ విషయంలో సవ్యసాచివలె నాకు సహాయపడిన శ్రీ తిరుమల రామచంద్రగారిని గురించి నాలుగు మాటలు వ్రాయడం నా విధిగా భావిస్తున్నాను. వీరితో నాకు గల పరిచయం నిన్న మొన్నటిది కాదు. ఉభయుల మైత్రికి షష్టిపూర్తి దాటింది. వీరిని చూచినప్పుడల్లా "సంస్కృత ప్రాకృత శౌర సేనీ ముఖ్య భాషా పరిజ్ఞాన పాటవంబు" అనే శ్రీనాథుని పద్యభాగం జ్ఞాపకం వస్తూ వుంటుంది. పై పద్యపాదంలో ఉదాహరించిన భాషలేకాక ఆంగ్ల తమిళ కన్నడ హిందీ భాషలందు కూడ వీరికి పరినిష్ఠితమైన ప్రజ్ఞ కలదు.

వీరు స్వయంగా "పరిశోధన" అనే పత్రికను చాలకాలం ప్రచురించి, పరిశోధన పాఠాలను తెలుగువారికి అందించారు. తెలంగాణా, మీజాన్, ఆంధ్రప్రభ ఆంధ్రపత్రిక, ఆంధ్రభూమి మున్నగు దినపత్రికలలో ఉప సంపాదకులుగా పనిచేసి, ఆయా పత్రికాధిపతుల మన్ననలు పొందినవారు. ఒక్కమాటలో చెప్పాలంటే- ఆయా పత్రికలకు పలుకుబడి కలిగించారు. వీరి పాండిత్యం నివురుగప్పిన నిప్పు వంటిది. కదిపిచూస్తేనేగాని కణకణలాడే రవ్వలు బైటికి రావు. అయితే, వీరికి కాలం కలిసిరాలేదు. విశ్వనాథవారన్నట్లు "డిగ్రీలులేని పాండిత్యమ్ము లెక్కకు రాని పాడుకాలాన పుట్టి"నారు. మరో రాష్ట్రంలో అయితే, ఏదో ఒక ఉన్నత పదవిని అలంకరించి ఉండేవారు. వీరిలో మరొక విశేషం ఉన్నది. పూజ్యులు, ప్రాతస్స్మరణీయులు అయిన మా అన్నగారు ప్రభాకరశాస్త్రిగారికి అతి ముఖ్యులైన అంతేవాసులు వీరు. పైపెచ్చు వైద్యరత్న పండిత డి. గోపాలాచార్యులుగారి వైద్యవిద్యావంశానికి కూడ చెందినవారు కావడంవల్ల ఒక లెఖ్ఖ ప్రకారం నాకు సతీర్థ్యులవుతారు. తిరుమల- తిరుపతి దేవస్థానం మహంతుల హయాంలో ఉన్నప్పుడు గోపాలాచార్యులు గారి పలుకుబడిని వినియోగించుకొని అప్పటి మహంతు గారొక ఆయుర్వేద కళాశాలను తిరుపతిలో నెలకొల్పారు. గోపాలాచార్యులుగారి మద్రాసు ఆయుర్వేద కళాశాలలో ప్రథమ కక్ష్యలో ఉత్తీర్ణులైన సి. వి. సుబ్రహ్మణ్యశాస్త్రిగారు దానికి ప్రధానాచార్యులుగా నియమింపబడినారు. వారివద్ద తిరుపతిలో వీరు ఆయుర్వేద విద్య అభ్యసించారు. కాబట్టి మా మైత్రి మరింత గాఢతరమైనది. వైదుష్యంలో నాకంటే వీరు పెద్దలు.

వయస్సులో నాకంటే చిన్నవారు. అన్నదమ్ముల బాంధవ్యంకూడ మరొకవిధంగా మార్చుకోవచ్చు. ఇట్టి బహుభాషాకోవిదులు నాకు సహాయపడటం నా అదృష్టంగా భావిస్తున్నాను. వార్ధక్యంలో ఇంద్రియ పాటవం కోల్పోయి చక్షురక్షర సంయోగం లేకున్నా వారు నన్నుగా భావించి ఎప్పటికప్పుడు ప్రెస్‌కాపీని నాకు చదివి వినిపిస్తూ అవసరమైన సవరణలు చేస్తూ గ్రంథ ముద్రణ సాగించారు. మా అన్నదమ్ముల పంపిణీలో ఒప్పులన్నీ వారివి, తప్పులన్నీ నాకు దక్కినవి. ప్రాజ్ఞులు తప్పులు నాకు తెలిపితే కృతజ్ఞతతో దిద్దుకోగలను. ఇందులో నా ప్రసక్తి అమర్చినదాంట్లో అత్తగారు వేలు పెట్టడం లాంటిదే.

ఈ గంథ్రాన్ని శ్రద్ధగా సకాలానికి ముద్రించి ఇచ్చిన విప్లా ప్రింటర్స్ హైదరాబాద్-20 వారికి, ముఖ్యంగా ఈ సంస్థ నిర్వాహకులు శ్రీ యమ్. విజయసేనారెడ్డి గారికి నా ప్రత్యేక ధన్యవాదాలు.

## పారిభాషిక పదాల వివరణ

ఈ గ్రంథంలోని కొన్ని పారిభాషిక పదాలకు వివరణ అవసరం. ఇవి వైద్యులకు తెలిసినవే అయినా ఇతరులకు తెలియడానికి వివరిస్తున్నాను.

### 1. పుటపాకం :

పుటపాక మంటే పుటాంతరితౌషధ పచనం. రెండు పాత్రల కలయికతో ఏర్పడిన సంపుటంలో మందును పెట్టి పచనం చేయడం. పుటపాకం చేయవలసిన ద్రవ్యాన్ని మెత్తగా నూరి, మర్రాకులలోగాని, ఆయా గ్రంథాలలో చెప్పిన ఆకులలోనో, కాయల డొల్లలలోనో పొట్లంగా కట్టి దారంతో చుట్టి, దానిపైన మెత్తని తడిమట్టిని అంగుళం మందంగా పూసి, ఆ మట్టిపూసిన పొట్లాన్ని కుమ్ములో పెట్టి, పైమట్టి ఎర్రగా కాలేవరకు ఉంచి చల్లారిన తర్వాత లోపల ఉడికిన ముద్దను తీయాలి. దీనినే పుటపాక మంటారు.

### 2. వేధ :

రసతంత్ర గ్రంథాలలో పాదరసానికి అష్టాదశసంస్కారాలు చెప్పబడ్డాయి. వాటిలో చివరిదయిన పద్దెనిమిదవ సంస్కారం వేధ. దీనిని వేధనమనికూడ అన్నారు. ఆ విధంగా సంస్కరింపబడిన పాదరస ప్రయోగం వల్ల నీచ

లోహాలను ఉత్తమలోహాలుగాను, శరీరాన్ని జరామరణ రహితమయిన అమృతత్వ సిద్ధి పొందేటట్లు చేయవచ్చు. ఇట్టి ప్రక్రియనే లోహవేధమని, దేహవేధమని అంటారు. ఇది రసతంత్ర ప్రయుక్తమైన ప్రక్రియ. ఈ గ్రంథంలో 'వేధయిత్వా', 'వేధనంకృత్వా' అనే ప్రయోగాలు ఉన్నాయి. దీనిలో పాదరస ప్రసక్తి లేదు. కనుక ప్రకరణాన్ని బట్టి అర్థం చెప్పవలసి ఉంటుంది. వివిధ ఔషధ ద్రవ్యాలను, యోగంలో చెప్పిన వాటినన్నిటినీ విధి ప్రకారం అణుసమ్మేళనం కలిగే వరకు మర్దించి, ద్రవ్యగుణాన్ని ఇనుమడింప చేయడానికి చేయదగిన క్రియావిశేషం వేధ అని చెప్పుకోవాలి. వేధ అనే పదానికి తొలిపుచ్చు, బాధించు, వేధించు అనే అర్థాలు గూడ ఉన్నాయి.

## 3. పుత్తలికా :

ఈ పదం మంత్రశాస్త్రానికి, తంత్ర యుక్తికి సంబంధించింది. "తృణ కాష్ఠ వస్త్ర పత్ర మృద్ధాతు రత్నాది నిర్మిత ప్రతిమూర్తిః" అని చెప్పబడిన వస్తువులలో దేనితోనైన ఒకదానితో ప్రతిమనుచేసి అమావాస్య నాటి అర్ధ రాత్రిలో విరోధమును సాధించడానికై చేసే బాణామతీ ప్రక్రియ (చేతబడి).

## 4. విదగ్ధా :

విదగ్ధులంటే పండితులు, నిపుణులు అని అర్థం.

"ధర్మార్థ కామ యశోజీవితానాం యే సాధనైక తత్పరాః,
తే ధన్యాస్తే విదగ్ధాః న పునః పరవంచన తృష్ణాః."

ధర్మార్థ కామాలలో పేరు ప్రతిష్ఠలు వెలార్చే జీవితాన్ని సాధన చేయడంలో నిమగ్నులై ఉండేవారే విదగ్ధులు. ఇతరులను మోసగించడంలో మునిగితేలేవారు కారు.

## 5 తైలపాకవిధి :

ఏ యోగంలోనైనా తైలప్రమాణం చెప్పనప్పుడు కల్కాదులకు నాలుగు రెట్లు తైలం, తైలాదులకు నాలుగు రెట్లు ద్రవద్రవ్యాలను (పాలు, గోమూత్రం, ఉదకాదులు,కషాయం) కలిపి తైలం మాత్రం మిగిలేట్లు కాచి, తైలం గ్రహించాలి. ఇదే తైలపాక విధి.

## 6. క్వాథకల్పన. (Decoction)

కావలసిన ద్రవ్యాన్ని మెత్తగా నలియగొట్టి, ద్రవ్యానికి పదహారు రెట్లు నీరు కలిపి ఎనిమిదో పాలు మిగిలేటట్లు కాచిన ద్రవ ద్రవ్యానికి క్వాథం అనిపేరు.

## 7. ఖాండవాస పద్ధతి :

ఖాండవాస పద్ధతి అంటే ఔషధ ద్రవ్యానికి కుండద్వారా మరొక ప్రభావం కలిగించడం. ఇది రెండు విధాలుగా చేస్తారు. కుండలో వాసన పట్టించవలసిన ద్రవ్యాన్ని ఉంచి, ఆ కుండకు పరిశుభ్రమైన వస్త్రంతో వాసెన కట్టి, ఆ వాసెన మీద అవసరమైన ద్రవ్యాన్ని ఉంచి, కుండను వెచ్చజేస్తే, వాసెనమీది ద్రవ్యానికి ఆవిరివలన వాసన పడుతుంది. ఇదొక పద్ధతి. వాసన పట్టించవలసిన ద్రవ్యాలను ఒక పరిశుభ్రమైన వస్త్రంలో మూటగట్టి, కుండమూతికి సరిపడే బలమైన కర్రకు ఈ మూటను వ్రేలాడగట్టి, కుండమీద ఆ కర్రను అడ్డంగా పెట్టి కుండను వెచ్చజేయడం రెండవ పద్ధతి. ఇది అభ్యాసంగా చేసే ప్రక్రియ, అనుభవపూర్వకమైంది.

## పుత్తలికా పంచవింశతికా

ఈ హరమేఖలా చతుర్థ పరిచ్ఛేదంలో "పుత్తలికా పంచవింశతికా" అనే శీర్షిక కింద విషయాలు 238 పుట నుండి 248 పుటవరకు వర్ణింపబడినాయి. గద్య పద్యాత్మకంగా ఉన్న ఈ భాగంలో పుత్తలికా (బొమ్మ) నిర్మాణం, దానికి కావలసినద్రవ్యాలు, ప్రయోగించేదశలో బీజాక్షరయుక్త మంత్రాలు, అనుష్ఠానం, ఉపాసనా విధానం, పుత్తలికను స్థాపించదగు ప్రదేశాలు నిర్దేశించడం జరిగింది. మంత్రాలు అనుకున్న వ్యక్తి మారణానికో, వశీకరణానికో ఉపయోగపడే విధంగా ఉన్నాయి. భూమిలో పాతిపెట్టిన పుత్తలికను బయటికి తీస్తే మోక్షమని, తీయకుండా ఉంచితే మరణమో, వశీకరణమో, వ్యాధులు సంభవించడమో జరుగుతాయని ఫలితాలు చూపబడినాయి. ఈ ప్రక్రియలను చేతబడులు అంటారు. ఈ విద్యను ఎరిగిన వ్యక్తిని భూతవైద్యుడని వ్యవహరిస్తారు.

మంత్రాలు మహిమోపేతమైనవి. యంత్రాలు శక్తియుక్తమైనవి. తంత్రాలు యుక్తిపరమైనవి. చక్రాలు అవయవ విశేషాలు. ఇవి మంత్రశాస్త్ర విహితమైన సాధన విశేషాలు. ఇవన్నీ శక్తి స్వరూపాలు. శక్తి శబ్దానికి 'దేవత' అని అర్థం చెప్పవచ్చు. శక్తిలేనిదే ఎవ్వరూ ఏ పనీ చేయజాలరు. మంత్ర శాస్త్రవేత్తకు మంత్రాలతో బాటు తంత్రాలు, యంత్రాలు, చక్రాలు తెలిసి ఉండాలి.

మంత్రం : "మంతారం త్రాయత ఇతి మంత్రః". మననం చేసేవానిని రక్షించేది గనుక మంత్రమని పేరు ఏర్పడింది. మంత్రమంటే కొన్ని బీజాక్షరాల సంపుటి. శబ్ద ప్రధానమైన మంత్రాన్ని జపించడం వల్ల శక్తి ఉద్భవించి ఆశించిన ఫలితం ఇస్తుంది. బీజమనగా విత్తు. దీనినుంచి మొలచే మొలకే శక్తియుక్తమైంది. ఇదేవిధమైన శక్తి బీజాక్షరంలో ఇమిడి ఉంది. మిక్కిలి ప్రభావం గల ఈ శక్తి బహువిధ కార్యాలను నెరవేర్చగలది.

యంత్రం : మంత్రాన్ని అనుసరించి రేఖాపూర్వకంగా నిర్మితమైన రూపవిశేషం యంత్రం. ఈ యంత్రంతో ఆయా స్థలాలలో లిఖితమైన బీజాక్షరాలు చీలలవంటివి. ఇవి యంత్ర చలనంలో ప్రముఖ పాత్ర వహించేవి. ఇట్టివే బీజాక్షరాలు.

తంత్రం : "తంత్రణాత్ తంత్రమ్" ఇది మంత్రోచ్చారణవలన కలిగే బలాన్ని శాసించేదిగాను, సాహిత్యపరంగాను ఉంటుంది. ఇది ప్రయోగించే విధానాలను తెలిపేదిగాను వుంటుంది. మంత్రమహిమ కార్యరూపం దాల్చడానికి ప్రయోగ విధానపరమైన తంత్రం ముఖ్యహేతువు కాగలదు.

చక్రం : "చలతీతి చక్రమ్." చలించేది, గుండ్రంగా తిరిగేది చక్రం. ఇది యంత్రాన్ని నడిపే అవయవ విశేషం. ప్రపంచంలో అన్ని క్రియలు (పనులు) చక్రం మీద ఆధారపడి నెరవేరుతున్నవి. చక్రంలో ఇమిడి ఉండే యంత్రంలో బీజాక్షరాలు శక్తిమంతాలై తేజోవిలసితాలుగా ఉండి, మార్గదర్శకాలవుతాయి.

మంత్ర యంత్ర తంత్ర చక్ర ప్రయోజనాలు అసంఖ్యాకాలు. ఇవి మానవుని జీవయాత్రకు సాధనాలు.

ఆయుర్వేదజ్ఞులు భూత ప్రేత పిశాచాది గ్రహాలవల్ల కలిగే ఉపద్రవాలు చెప్పి, వాటికి తగిన వివిధ చికిత్సలుకూడ తెలిపినారు.

గ్రహశబ్దానికి పలువిధాలుగా అర్థాలున్నాయి.

1. "గ్రహ ఉపాదానే" అనే ధాతువునుబట్టి గ్రహించడం, పుచ్చుకొనడం, పట్టుకొనడం, బంధించడం అనే అర్థాలు రాగలవు. మానవుని సమస్త శక్తులూ గ్రహించేది గ్రహం.

2. గృహ్ణాతి "జానాతీతి" గ్రహః అనితర సాధారణ జ్ఞానం కలది.

3. గృహ్ణాతి "గ్రహాతీతి" గ్రహః. ఒకచోట ఉండక మనుష్యులను ఆవేశించే స్వభావంగలవి గ్రహాలు.

4. గృహ్ణాతి "ఆకృష్ణాతీతి" గ్రహః. అసహనంగలవి గ్రహాలు.

5. గృహ్యంతే "జ్ఞాయంతే తత్తచ్ఛలాదిభిరితి" గ్రహః. ప్రత్యక్ష దృశ్యాలుకాక వాని వాని శీల కర్మాచార శక్తులవలన అనుమాన గమ్యాలైనవి గ్రహాలు.

సూర్యాది నవగ్రహాలు, భూతాది విషక్రిములు, స్కంధాది పిశాచాలు మొదలయినవి వేరువేరు రూపక్రియలు గలవైనా మనకు సామాన్యంగా గ్రహాలనే స్ఫురిస్తాయి. జీవరూపంలో ఉంది రోగోత్పాదకాలైన విషక్రిములు ఈ కోవకే చెంది ఉన్నవని భావించాలి. "యో భూతవిషవాతానా మకాలేనాగతశ్చ యః" (చర. శా. 1.119) అనే వాక్యాలకు అర్థం చెప్పేటప్పుడు "భూతాః సవిషకృమి పిశాచాదయః" అని స్పష్టంగా చక్రపాణి అర్థవివరణచేసి మన సందేహాలను తీర్చాడు.

ఈ పుత్తలికా పంచవింశతికా ప్రకరణం చతుర్థ పరిచ్ఛేదం లోనిది. ఇది ఈ గ్రంథవిషయానికి సంబంధించింది కాదని, మంత్రశాస్త్రం లేదా గ్రహభూత విద్యకు సంబంధించి ఈ గ్రంథంలో ప్రక్షిప్తమైందని తెలియవలసి ఉంది. ఎందు కంటే, ప్రాకృతం గాని, సంస్కృతచ్ఛాయ గాని ఈ ప్రకరణంలో లేదుగనుక. దీనిని చతుర్థ పరిచ్ఛేదం చివర ప్రచురించాను.

# ప్రథమ పరిచ్ఛేదం

ఈ గ్రంథముద్రణ ముగుస్తుండగా, ఎన్నాళ్ళనుంచో లభించని 'హర మేఖల' ప్రథమపరిచ్ఛేదం వారణాసి హిందూ విశ్వవిద్యాలయ గ్రంథాలయంలో ఉన్నదని తెలిసింది కాశీ హిందూ విశ్వవిద్యాలయంలోని ఆయుర్వేద విశ్వ విద్యాలయంలో వైద్యశాస్త్ర విజ్ఞానసంస్థ (**The Institute of Medical Services**) ద్రవ్యగుణ శాస్త్రాచార్యులుగా ఉండి పదవీ విరమణచేసిన ఆచార్య పి. వి. శర్మగారు కోయంబత్తూరు జర్నల్‌లో (**Ancient Science of Life. Vol. V No. 3. Jan. 1986 Page 148-150**) ఈ ప్రథమ పరిచ్ఛేదాన్ని ఆంగ్లానువాదంతోపాటు ప్రకటించారు. ఇది విపరీత లేఖక ప్రమాదజుష్టమై ఉంది. ప్రారంభంలోని భాగమిది.

అథ హరమేఖలా తంత్రోయం లిఖ్యతే ప్రథమ పరిచ్ఛేద ప్రకరణా శుభామస్తు.

శ్రీ గణేశాయ నమః॥ అథ హరమేఖలా
శృణు దేవి ప్ర(వ)క్ష్యామి మహౌషధీనాం సముచ్చయమ్
పృథివ్యా య....ని దేహాని సర్వరోగస్య రోగతః.

శ్రీ దేవ్యువాచ :-

శృణు దేవ మహాదేవ దేవ దేవ మహేశ్వర,
కేన ప్రకారేణ జంతూనాం నిర్వ్యాధిం చ భవతీ ధ్రువమ్.
శివభక్తిమయం విశ్వం తత్కథం రోగపీడితమ్,
జీవినాం జీవరూపేణా వ్యామహం స.... ద్దహాస్థితమ్.
కథం తు దేవానాం సర్వదా దేహపీడితమ్,
తత్కథం తీర్యతే దేవ కృపయా కథయప్రభో.
కేన ప్రకారే తు నృణాం హానిర్వ్యాధేః భవేద్ధ్రువమ్,
మమ వాత్సల్య దేవేశ మహౌషధీం ప్రకాశయ.
యస్య ప్రకాశ మాత్రేణ మానవో దేవవద్ భవేత్,

శ్రీ శంకర ఉవాచ :—

> మహౌషధీం కథయిష్యామి మహ్యాం భావయేద్యది.
> తథా ప్రయోగమాత్రేణ.... తంత్రాద్వా ముచ్యతే నరః,
> తవాత్మరోధత్ వక్ష్యామి న దేయం యస్య కస్య చిత్.
> మహౌషధీ కథయామి గుహ్యాయంతం మహత్ఫలమ్,
> హరేమేఖలానామిదం లిఖయస్య మహేశ్వరీ.
> కలౌ యుగే మహాఘోరే దుష్టే స్థావర జంగమే,
> సీద.... యా(సదత్కార్యాః) సుమనాః సర్వే వృత్రాభృష్టం పార్వతీ
> ప్రథమమౌషధం దేవీ కచ్ఛతే శృణు పార్వతీ.

గ్రంథ ప్రారంభం పార్వతీ పరమేశ్వర సంవాద రూపంలో ఉన్నది. అవి కేవలం సంస్కృతశ్లోకాలేగాని ప్రాకృతం, వ్యాఖ్య లేవు. అందువలన ఇది "హరమేఖల" ప్రథమ పరిచ్ఛేదమేనా- అన్న సందేహమూ కలుగుతున్నది. గ్రంథారంభంలో "హరమేఖలా" అనే శబ్ద ప్రయోగంతో గ్రంథనామం చెప్పారు. కనుక ఇది ఇదే గ్రంథానికి సంబంధించిందేమోనని భావించవలసి వస్తున్నది.

ఈ ప్రథమ పరిచ్ఛేదాన్ని తెలుగు అనువాదంతో కూడ ప్రకటింప దలచాము.

అక్షయ, ఆశ్వయుజ
పూర్ణిమ

వేటూరి శంకరశాస్త్రి

# మనవి మాటలు

ఆయుర్వేదోద్ధారకులు, వైద్యరత్న పండిత డి. గోపాలాచార్యులవారి ప్రథమ శిష్యబృందం ప్రథమ ప్రియ శిష్యులు, తిరుపతి శ్రీ వేంకటేశ్వరాయుర్వేద కళాశాల ప్రిన్సిపాలురు, గురువర్యులు, ఆయుర్వేద భూషణ చింతలపల్లి వేంకట సుబ్రహ్మణ్య శాస్త్రిలవారి అంతేవాసిగా చిన్నవాడు ఆయుర్వేదాన్ని అధ్యయనం చేసిన భాగ్యవిశేషమే ఈ హరమేఖలను తెనుగున అనువదించడానికి నాకు గల అర్హత.

ఈ గ్రంథంలో చాలచోట్ల మూలప్రాకృత సంస్కృతచ్ఛాయా వ్యాఖ్యలకు సంవాదం కనిపించదు. అలాంటప్పుడు మూలప్రాకృతం అనుసరించి అనువదించాను. మూలచ్ఛాయలు పరస్పరం సంవదించనప్పుడు వ్యాఖ్యను అనుసరించాను. గ్రంథంలోని అస్పష్టతవల్ల చాలచోట్ల ఓషధీ వివరణలో పొరపాట్లు జరిగి ఉంటాయి. క్షంతవ్యుణ్ణని వైద్య మిత్రులను ప్రార్థిస్తున్నాను.

ఇలాటి అమూల్య గ్రంథాన్ని తెనుగున అనువదించే అవకాశం కలిగించినందుకు గురుతుల్యులు డాక్టర్ వేటూరి శంకర శాస్త్రిగారికి కృతజ్ఞతావందనాలు అర్పిస్తున్నాను.

గురువర్యులు సుబ్రహ్మణ్య శాస్త్రిలవారి శిష్యవాత్సల్యం అసదృశం. వారు తరచు విద్యార్థులను కపిల తీర్థం కొండలకు, ఆకాశగంగ, జాబాలి తీర్థాలకు పిలుచుకుని పోయి ఓషధీ పరిచయం చేసేవారు. అవి మా కొక విందు. ప్రతి విద్యార్థీ తమ గురువులవా రంతటివాడు కావాలని వారు ఆవేదన పడేవారు. వారి నిస్స్వార్థ నిష్కల్మష వాత్సల్యమూర్తికి ఈ హరమేఖలాంధ్రానువాదాన్ని సమర్పించి ఋణవిముక్తుణ్ణి అవుతున్నాను.

హైదరాబాదు
అక్షయ ఆశ్వయుజ
పూర్ణిమ

భాషాసేవకుడు
**తిరుమల రామచంద్ర**

# హరమేఖల-గ్రన్థోదన్తం

**అన్వేషణం :-** ఇది చాలకాలంనాటి మాట. వృక్షాయుర్వేదానికి సుష్ఠు ప్రతిని వెలయించుటకోసం వేర్వేరు ప్రతుల శోధించుతూ ఉంటిని. తాడిమేటి వారు ప్రచురించిన వృక్షాయుర్వేదపు ప్రతిలోనని గుర్తు: "దోహదచింతామణి", "హరమేఖల"లు పేర్కొనబడినవి. వాటిని సంపాదించుట కెంతో కుతూహలపడి యత్నించినాను. వాటిలో దోహదాలు చెప్పబడియుంటవని నా ఆశ.

ఆ అన్వేషణలో "దోహద చింతామణి'' రాయల్ ఏషియాటిక్ సొసైటీ, బెంగాలు వారిదగ్గరున్నదని తెలిసినది. వారికి వ్రాయగా దాని ప్రతులై పోయినవని తెలిపిరి. నాటికీ నేటికీ అది నాకు అందనేలేదు. ''హరమేఖల'' నేపాల్ దర్బార్ లైబ్రరీ వారి క్యాటలాగులో కనుపించినది. దానికోసం వారి కెన్నో మారులు జాబులు వ్రాసినాను కాని ఒకదానికైనా వారినుండి బదులు జాబు పొందలేక పోయినాను. నాడు తపాలా సౌకర్యాలు ఈ రెండు దేశాలకూ సరిగా లేవేమో! కాక జాబుల రాక-పోకలకు నాటి రాజకీయ నియమాలూ-నిబంధనలూ ఏవైనా అడ్డై నవో! అంతలో ఆ నా యత్న మాగినది.

ఇటీవల తిరువేంద్రము సంస్కృత సీరీస్ (టి. యస్. యస్.) వారు ''హరమేఖల''ను ప్రచురించినారని తెలియగా నా అభిలాష చిగురించినది. వారికి వ్రాసి దాని ప్రతిని సంపాదించినాను దయతో వారు నాకు దానిని పంపినందుకు వారికి నా కృతజ్ఞతాభివందనములు. చిరకాలంగా నే నభిలషిస్తూ ఉన్న గ్రంథం దొరికినదనే ఉత్సాహాతిరేకంతో దాని పుటలను తెరచి చూచితిని. తొలుత నా ఉత్సాహం కొంత కుంటుపడ్డది. నే నేవిషయాలకోసం యింతగా యిన్నాళ్ళుగా దాని నాశిస్తూ వున్నానో ఆ విషయాల పొలకువలైనా దానిలో లేవు.

అయితే అంతమాత్రాననే అది నిరుపయోగమైనదనను. ఇదొక అద్భుత మైన రచన. నిత్యోపయోగమున కనువైనది.

**కాలము :-** రచయిత వుదాహరించిన వొక కారికయే దీని కాలనిరూపణకున్న సాధనం. అది : "శ్రీ విక్రమాదిత్య కాలాత్ సప్తాశీత్యధికే ధర్మశతాష్ట గతే మాఘస ప్తమ్యా మేషా హర మేఖలావ్యుత్పన్న లోకై రేవావగతతత్త్వా నిష్పాదితా॥ (మూలానికిది ఛాయ) దీనినిబట్టి విక్రమశకం 887 క్రీ॥శ॥ 820 (క్రీ-9 శతాబ్ది)లో యిది రచింపబడినదగును.

**రచయిత:-** ఈ కవిని గూర్చి విశేషాలు తెలియకున్నవి. అందుకు తగిన సాధనాలేవీ లభించలేదు. ఈ కృతిలోనే రచయితే తనను గురించి రెండు ముక్కలు చెప్పుకున్నాడు అదొక్కటే మనకున్న సాధనం. ఇట్లు తెలిపినాడు:

"ధరణి వరాహ రజ్జే కవిమండణ తణఅ మాహవ సుఏణ।
రయిఅ చిత్తఉడే మాహుఏణ హరమేఖలా॥
ధరణి వరాహ రాజ్యే కవిమండన తనయ మాధవ సుతేన।
రచితా చిత్రకూటే మాహుకేన హరమేఖలా॥" (ఛాం

దీనివలన యీ కృతికర్త మాహుకుడనీ, ఆయన తండ్రి మాధవుడు, తాత కవిమండనులుననీ తేలినది. కవిమండనుడన్నది తాతగారి నిజమైన పేరో, బిరుదమో! కవిసార్వభౌముడన్నట్లు, కవిమండనుడన్నది బిరుదమేనని తలచుటకే యెక్కువ వీలున్నది. తండ్రి ప్రసిద్ధుడుగాడేమో; ఆయనను మాధవుడనే పేర్కొన్నాడు. ఈ మాహుకుడు శైవుడై యుండు ననుకొందును. ఈ నా ఊహ కివి ఆధారాలు. ఈ కృతిపేరు "హారమేఖల" అని పెట్టుట. "త దహం చైకతో వక్ష్యే సుభాషితకరండకం, హర ఆగమ లాగ ర్తే సంజ్ఞావర్ణ సమన్వితం" చతుర్థ పరిచ్ఛేదం 182 కారికలో హర ఆగమము (శైవాగమం) ను వుదాహరించటం.

ఈ కృతిని చిత్రకూటంలో రచించినానని చెప్పినాడు. చిత్రకూటం ఆయన నివాసమో, చిత్రకూటాన ఉన్నపుడు రచించినాడో నిర్ధారించుటకు వీలుగాకున్నది. ఈ చిత్రకూటం వరాహరాజ్యంలోని దట. వరాహరాజ్య మేదగునో! చిత్రకూటం రామాయణంలో ప్రసిద్ధమైన ప్రదేశం. చిత్రకూటాన్ని గూర్చి మూడు వాదాలున్నవి. మైసూరు రాష్ట్రంలో చితల్‌దుర్గమే చిత్రకూటమని ఒక వాదం. హంపి దగ్గరనున్న ఆనెగొందే కిష్కింధ అనీ, ఆ చేరువనగల పర్వతమే చిత్రకూటమనీ

యింకొక వాదం. భద్రాచలం ప్రాంతానగల పర్వతమే చిత్రకూటమని మరొక వాదం. ఇవేవైనా వరాహధాజ్యములోని వనుట పొసగునా?

**భాషః-** దీని భాష ప్రాకృతం. అది మాగధి కావచ్చు. ఇదొక అసాధారణ విషయం. మనకు శాస్త్రవాఙ్మయం- అందునా వైద్యాదులవి సంస్కృతములోనే పరిచితంగా ఉన్నది. ఇదో ప్రాకృత రచన. ఆనాడు ప్రాంతీయాలైన ప్రాకృతభాషలలోను శాస్త్ర వాఙ్మయం ఉండేదని యిది మనకు తెలుపుతున్నది. ప్రాకృతాలు ప్రాంతీయ వాడుక భాషలు. కనుక ఆ యా శాస్త్రాల విషయాల నందరకూ గిరిగీతగానైనా తెలియుటకుగాను ప్రాకృతాలలో పొందుపరచి యుందు రనవచ్చును. అయితే అవి శాస్త్రాల ప్రాతిపదికల చర్చలతో చిక్కు బెట్టక అనుభవాల కందనట్లు పొడి పొడి మాటలతో నిగ్గును తెలుపునవిగా నున్నవనదగును. ఇట్టివాటిలో ప్రయోగ దృష్టములై వాడుకలో ఉన్న విషయాలూ- యోగాలూ- ఆవిష్కారాలూ ఉల్లేఖింపబడుతూ ఉండటం పరిపాటి. ఆ యా కులవృత్తులలో కుదురుకొని వృద్ధపరంపరగా వస్తూఉండే వృత్తిమర్మాలను నా డెంతో పదిలంగా వ్రాసుకొని దాచుకొంటూ ఉండేవారు ఆ యా కళోపాసకులు- వృత్తిపరులు. నిజానకు ఇట్టి కళామర్మసంవిధాలైన రచనలే కళలకు-వృత్తులకు జీవగఱ్ఱ లనదగినవి విదేశీయపు యన్త్రశక్తి వికట విహారంతో మన దేశీయ పరిశ్రమలు వికలమై పోయినవి, మన జనపదాలు-జనపదాల నాశ్రయించుకొని ఉన్న వృత్తులు- కళాకారులూ నాసిరిల్లిపోయినారు. ఆయా వృత్తుల వారు, కళాకారులు- శిల్పులు తమ తమ కులవృత్తులు కూలిపోగా జీవికకు వేరు దారులు పట్టవలసినవారైనారు కాగా తమ తమ పురాతన వృత్తులు- కళలపై అభిలాష - ఆదరము - అభిమానములు పోయినవి అందువల్ల తరతరాలుగా తమ పూర్వులు కాపాడుకొంటూవచ్చిన ఆయా శాస్త్రవాఙ్మయంపై వారి కాస్థ లేదు. ఆవాఙ్మయమూ - సంప్రదాయకజ్ఞానమూ ఇప్పటికే నశించినది. చెదురు బెదురుగానున్న దానినైనా సేకరించుటకు ఏ ఉద్యమమూ లేకుండుట దురదృష్టం నశింపగా మిగిలినది హరమేఖల అనవచ్చు. ఇంకా ఇట్టే ఏవైనా అక్కడక్కడ ఏందైనా ఒదిగి ఉన్నవేమో!

**లభ్యమైన ప్రతి :-** ఈ ప్రచురింపబడిన హరమేఖల ప్రతిలో మొదటి పరిచ్ఛేదం లేదు. దానిని సంపాదించుటకు టి. ఎస్. ఎస్. వారెంతో ప్రయత్నించిరి. ఎంతోకాలం వేచిచూచిరి. కాని వారియత్నం ఫలించలేదు. నేపాల్ దర్బార్ లైబ్రరీ వారి ప్రతి టి. ఎస్. ఎస్. వారి దృష్టికి అందినట్లులేదు. నేపాల్ దర్బార్ లైబ్రరీ వారి ప్రతిలో మొదటి పరిచ్ఛేద మున్నదేమో! ఈ హరమేఖల అయిదు పరిచ్ఛేదములు గలది. మొదటి పరిచ్ఛేదం లభించలేదు. మిగతా నాలుగు పరిచ్ఛేదాలే మనకు అందుబాటుగా ఉన్నవి.

**విషయం :-** దీనిలో అనేక యోగాలు వివరింపబడినవి. ఆ యోగాలు వివిధవిషయాలకు సంబంధించినవిగా ఉన్నవి. ఈ యోగాల బాహుళ్యాన్ని బట్టి కావచ్చు "ప్రయోగమాల" అని దీనికి మారుపేరును రచయితే తెలిపినాడు. "హరమేఖలా-ప్రయోగమాలా రచితా" అని దీని ముగింపున గల వాక్యం. నిజానికీపేరే దీనికి తగియున్నది. నిత్యజీవితంలో అక్కరపడే అనేక విషయాలకు ఉపకరించే యోగాలసముచ్చయంగా ఉన్నదిది ఈ ప్రయోగాలు చాలవరకు చిట్కాల వంటివిగా ఉండట మింకొక విశేషం. ప్రతి గృహస్థు స్వయంగా చేసికొని ఉపయోగించుకోవటమునకు వీలుగా ఉన్న వీయోగాలు. ఈ యోగాలలో తెలుపబడిన ద్రవ్యాలు చాలవరకు ఓషధులే. అవీ నిత్యపరిచితములైనవే. ఈ యోగాలన్నిటినీ ప్రధానంగా అయిదురకాలవిగా వర్గీకరించినాడు రచయిత. ఒక్కొక్క వర్గంవాటి నొక్కొక్క పరిచ్ఛేదంగా కూర్చినాడు. ఇట్లు వెలయించినవాటిలో మొదటి పరిచ్ఛేదం లోపించినది. కాన అందలియోగా లేవిషయికాలో తెలియకున్నది. మిగతా నాలుగు పరిచ్ఛేదాలలోని విషయాలివి :- 2 వ పరిచ్ఛేదంలో : సరిపడని వాళ్ళను సాధించేటందుకు, యెదుటివాళ్ళుచేసే ప్రయోగాలను నివారించేటందుకు యోగాలు చెప్పబడినవి. దీనిని రిపుదమన పరిచ్ఛేదమన్నారు. దీనిలో ఇతర యోగాలూ కొద్దిగా కనిపిస్తున్నవి. అయితే అవి చాల తక్కువగా వున్నవి. అట్లున్న ఇతరయోగాలు: పాములు, ఎలుకలు, నల్లులు, దోమలను నిర్మూలించే యోగాలు. మరికొన్ని ఇంద్రజాలమునకు సన్నిహితంగా ఉండేవీ ఉన్నవి. నీటిలో నిప్పును కలిగించే యోగాలాటివి. ఈ పరిచ్ఛేదపు యోగాలు అపాయకరమైనవి. ఇది యమదూతవలె దారుణమైనదని రచయితే అన్నాడు. అయితే వీటి నెందుకు చెప్పినాడు? వాటిని ప్రయోగించి లోకాన్ని చీకాకు పెట్టమని కాదు- ఇట్టి యోగాలు

లోకంలో వ్యాపించియున్నవి, వాటి గుట్టుమట్టులు తెలిసికొనండి. మీ విరోధుల దుడుకుతనాన్ని వీటితో త్రుంచివేసి ఆత్మరక్షణ చేసికొనండి. హాయి ననుభవించండి- అని ఆయన లక్ష్యం.

8 వ పరిచ్ఛేదంలో : వశీకరణయోగా లున్నవి. ఇది కౌటిల్య అర్థశాస్త్రంలోవి ఔపనిషదికాధికరణం వంటి దనవచ్చు. దాని మార్గంలో లింగస్థౌల్యం; ఉత్థాపనం; వీర్య స్తంభన; యోని సంకోచములకోసం చెప్పిన యోగాలవంటివీ దీనిలో ఉన్నవి.

ఈ పరిచ్ఛేదం ధూర్తలైన వేశ్యల తాళం పట్టించుటకోసమట. అయితే యీ వేశ్యలనేగాక లోకవశీకరణానికి యోగా లిందున్నవి. ఈ పరిచ్ఛేదమూ అందరకూ అందుబాటుగా నుండదగనిదే. ఇందలి యోగాలు ముప్పుగూర్చునవే. అయితే వాటికి - వాటికి ప్రతీకారాలూ తెలుపబడినవి. కాగా ఆ అపాయకరములైన వాటిని నిగ్రహంతో సవ్యంగా ఉపయోగిస్తే ఉపకారు లౌతవి. ఆలు-మగలకు పొరపు లొదవగా ఎడ-పెడ మొగాలుగా ఉంటూ జీవితం దుఃఖభాజనంగా ఉండేవారికి ఒద్దిక కలిగించి దాంపత్య జీవితాన్ని సుఖమయంగా చేసేటందుకూ యీ యోగాలే ఉపయోగిస్తవి. అట్లు దంపతుల సంయోజనము నుద్దేశించిన యోగాలూ ఉన్నవి.

ఇంతకూ ఈ 2, 8 పరిచ్ఛేదాలు జనసామాన్యంకోసం ఆయన రచించలేదు. విదగ్ధులే వీటి కర్హులని ఆయన స్పష్టంగానే చెప్పినాడు. విదగ్ధు లెవరు ? ఆయన నిర్వచన మిది: ధర్మార్థ కామ యశోజీవితానాం యే సాధనైక తత్పరాః తే భణ్యన్తే విదగ్ధా న పునః పరవంచనతత్పరాః. "ధర్మం అర్థం కామాలలో పేరుప్రతిష్ఠం వెలార్చు జీవితాన్ని సాధన చేయుటలో నిమగ్నులై యుండేవారే విదగ్ధులు. ఇతరులను మోసగించుటలో మునిగితేలేవారు కారు'' అని. కనుక చిత్తశుద్ధి-చరిత్రశుద్ధి లేనివారికి ఇవి అందదగనివి. వారు వీటిని దురుపయోగం కావించవచ్చు.

ఇంకా పొగరుబోతు పశువులను, ఏనుగులను వశీకరించే యోగాలూ దీనిలో ఉన్నవి.

9 వ పరిచ్ఛేదంలో భైషజ్యయోగా లున్నవి. ఇది నిరపాయకరమైనది. మిక్కిలి ప్రయోజనకరమైనదిన్నీ. అనేక చికిత్స లిందున్నవి. సామాన్యంగా జబ్బు

లనే తలపులేక ఉపేక్షిస్తూ ఉంటాము కొన్ని చీకులను. అవి బాధకాని బాధగానూ ఉంటవి. మచ్చుకు: బట్టతల, పేనుకొరుకుడు, వెంట్రుకలు రాలిపోతూ ఉండుట, చుండు, కండ్ల ఇరుకులు, పెదవులు బీటలువారటం, చిగుళ్ళవెంట నెత్తురుకారటం, నోటి దుర్వాసన, పంటినొప్పి మొదలైనవి. ఇట్టివాటికి చికిత్సలిందు తెలుపబడి నవి. ఇందలి యోగాలు గృహవైద్య మనవచ్చు.

కుష్ఠు, క్షయ, హృదయ పృష్ఠశూల, మూత్రకృచ్ఛ్రం, గండమాల, అర్బు దాల వంటి దారుణవ్యాధులకూ చికిత్సలు చెప్పబడినవి. స్త్రీ వ్యాధులకు, గర్భగ్రహ ణం, గర్భనిరోధాలకు, సూతికలకు చికిత్సలున్నవి. శిశుచికిత్సలు, పరిచర్యలూ తెలుపబడినవి. వివిధవిషాలకూ చికిత్సలున్నవి. ముఖ్యంగా పాము, తేలు కాటులకు వున్నవి ఇంకా పాములను పారద్రోలుటకూ నిరోధించుటకూ యోగాలున్నవి. శల్య చికిత్స యెక్కువగానే కనుపిస్తున్నది. విరిగిన యెముకలను అతుకుటకు, నాటు కున్న శల్యాలను వెలువరించుటకు, గాయాలను మాన్పుటకు యోగాలు తెలుపబడి నవి. ఈ మొదలైన శల్యచికిత్స లింకా వున్నవి. రసాయనాలూ చెప్పబడినవి. మరొక విశేషమేమిటా! పశురోగాలకూ చికిత్సలు తెలుపబడినవి. ఇవిగాక కౌచిమారంలో చెప్పబడిన "సుభగంకరణ" యోగాలవంటివి - అంగప్రసాదనం (అంగాల సౌష్ఠవం-సౌకుమార్యం) కోసమైనవీ చెప్పబడినవి.

6 వ పరిచ్ఛేదంలో గంధయుక్తియోగాలున్నవి. గంధయుక్తిని ఒక ప్రత్యేక కళగా వాత్స్యాయనాదులు పేర్కొన్నారు. ఈ గంధయుక్తియోగాలు సంధాన గ్రంథాలలో విరళంగా కనిపిస్తవి. కాళికా పురాణం 68 అధ్యాయంలో కొంత విపులంగా శాస్త్రమర్యాదతో కనుపిస్తుం దిది. గంధయుక్తి అంటే: సుగంధ ద్రవ్యాలను చేయుట. నేడు వాడుతున్న ఫేస్‌పౌడర్ (Face Powder) పొమేడ్ (Pomade) హేరాయిల్ (Hair Oil) ల వంటివి. ఇది నిత్యమూ వాడుకొనే నీటి దోషాలను సంస్కరించటం, వాటికి సువాసన కలిగించటం మొదలు పలుదోము చూర్ణాలు, స్నానచూర్ణాలు, నలుగు పిండ్లు మొదలైన నిత్యావశ్యక ద్రవ్యాల యోగాలు తెలుపబడినవి. ఊదువత్తులు, ధూపాల యోగాలూ, సుగంధ తైలాలు, ఆయా ఋతువులకు అనువైన లేపాలు తెలుపబడినవి. తీయమామిడి పండు మెత్తగావుంటూ చెడక నిలువవుండునట్లు చేసే యోగమున్నది. పూవులను ద్రుత ముగా చేసేటందుకు యోగాలున్నవి. ఈ పరిచ్ఛేదపు యోగాల సంగ్రహమును రచయితే చూపినాడు. అది :

"సంగ్రహోఽయం ప్రయోగాణాం పంచమస్య నిబధ్యతే।
తత్రాంఽఽబువాసనవిధి ర్దంతకాష్ఠవిధి స్తథా॥
మధూచ్ఛిష్ట విధి ర్నేత్ర పరికర్మాంజనం తథా।
ముఖవాసాది తైలాని తథోద్వర్తన సంవిధిః॥
అథ స్నానక్రియా స్నానం స్నానోపకరణాని చ।
పటవాసాది వర్త్యాచ- సుగన్ధాది సంవిధిః।
కృతిః కస్తూరికాయాశ్చ చిత్రగంధా ఽసవక్రియా।
కర్పూర కుంకుమ నఖా అగురోః సల్లకస్యచ॥
సహకారస్య చ కృతిః శశితైలకృతి స్తథా।
లవంగ తుటి కుష్ఠానాం కృతయశ్చ యథాక్రమం॥
సహకార (రసైర్య? స్థైర్యయు) క్తిః సర్వపుష్పద్రుతి స్తథా।
కేతకి చంపకాదీనాం ద్రుతయశ్చ తథా పృథక్॥"

**విశేషాలు :-** ఈ కృతిలో మూలదేవుడు-దేవదత్తుడు అనే పేరులు కనిపిస్తున్నవి. "దత్తా రుద్రేణ మూలదేవాయ భద్రాయ దేవదత్తాయ" అనీ, (3 వ పరిచ్ఛేదం. 42 కారిక)

"శ్రీమూలదేవేన మకరధ్వజ శరసమస్య। లేపనస్య పట్టబంధం కృతో మహాకాళభువనే" అనీ (3 వ పరిచ్ఛేదం- 52 కారిక) అన్నాడు.

మొదటిదానిలో గల మూలదేవ-దేవదత్త పదాలలో ఏదో ఒకటి నామ వాచకము కాదగును. రెండవ కారికలోనూ మూలదేవుడనే చెప్పబడినది. కాన మూలదేవుడే నామవాచకము. భద్ర-దేవదత్త పదాలు మూలదేవునకు విశేషణాలు అగు ననుకొందును. మూల దేవుడు చరిత్రకందిన పురుషపుంగవుడు కూడ అగునని నా జ్ఞాపకం. రెండో కారికలోనే మహాకాళభువనే అని ఉన్నది. ఈ మహాకాళ భువన మేది ?

కాళిదాస మహాకవి మేఘదూతంలో "అప్యన్యస్మిన్ జలధర మహాకాళ మాసాద్య కాలే.........కుర్వన్సంధ్యాబలిపటహతాం శూలినః శ్లాఘనీయాం" అని పేర్కొన్నారు. కాళిదాసులు మహాకాళం ప్రసిద్ధమైన శివక్షేత్రంగానూ వర్ణించిరి

ఈ కృతి (హరమేఖల) లో మహాకాళ భువన మన్నదీ కాళిదాసు వర్ణించిన ఆ సుప్రసిద్ధ శివక్షేత్రమందలి ఈశ్వరాలయమే అగు ననుకొందును.

రెండవ కారికలో చెప్పిన యోగానకు మహాకాళభువనంలో మూలదేవుడు పట్టభద్రం చేసినాడట. పట్టభద్రం అంటే ? ఆ యోగాన్ని మెచ్చి దానికొక జయపత్రం-యోగ్యతాపత్రం (Certificate) వంటి దానిని మహాకాళుని గుడిలో కట్టించినాడ నేనో, ఆ యోగాన్ని మహాకాళుని గుడిలో శిలపైన చెక్కించినాడనేనో నిర్ధారింపలేము. సిద్ధనాగార్జునవర్తి యోగాన్ని శిలపై గంధ్రించిరనుట ప్రసిద్ధమే. ఎట్లైనా ఈ యోగం మూలదేవుని మెప్పుబడసినదనుట నిశ్చయం. దీర్ఘ రతికోస మైన యోగ మిది. మూలదేవుని తమకిగా నిది సూచిస్తుంది.

ఆగమతంతునుకూడ కొద్దిగా పుణికినాడు. అది 4 వ పరిచ్ఛేదంలో "పుత్తలికా పంచ వింశతి'' అనేది (181 కారిక). అయితే దానికంతగా ప్రాముఖ్యం కనుపించదు.

ఈ కృతిలో దేశీయ పదాలు కొన్ని కనిపిస్తున్నవి. మచ్చుకు :- సిశింద = బాలుడు; ఖుంఖుణఓ = నాసికాసిర; పొట్టం = ఉదరం, కుట్టి = వేశ్య · కుంటెనగత్తె; సిహిణా = స్తనాలు; వఇళ్ళో = వృషభ ; సిహిరి = మహిషం; చుటుంబ = పశువు; గర్దరా = గొఱ్ఱె; సురకశి = గౌరవర్ణపుపాము; దివఓ = నీటి పాము; పహుణం = మాంసం; డఉఓ = లకుచం; కంకేల్లి = అశోకం: పేచరో= స్నుహి; తించ్చి = కరంజం; కణఇన్దో = పాటలం; తరవటఓ = ప్రవున్నాటం; మోరన్టఓ = అపామార్గం; కవోడి = క్షీరణి; హట్టి = పాఠా; ఉట్టఖణ్ణఓ = కరభ వారుణి; కదోట్టఅం = నీలోత్పలం; కట్టంబిళఓ = వనద్రాక్ష; వఅళీ = ? ; చేళిన్టఓ = మేషశృంగి; బిడిఅఇఓ = బల్యా; వామాహూ = ? ; వుదవా = ? ఓట్టా = ? ; మహిళీ = కార్పాసి; ఖుండఅం = గోపాల పీఠకం; పొట్టఅం = గుమ్మడి; హళ్ళా = ధాన్యకం; సిణ్హా = వర్షోదకం: గజ్జో = యవ; హిరి మిచ్చో = చణకం; పివళ్ళి = పేశి; ఘసిణం = కుకుంభం; ఓద్రడి = జపా పుష్పం.

ఇట్లున్న యీ దేశీయ పదాలన్నీ ఏకదేశీయాలుగా తోచవు. వివిధ ప్రాంతీయ భాషలలోనివీ దీని కెక్కినట్లున్నది. ఆయా సందర్భాలలో ఆ యా ప్రాంతాలనుండి యోగాలను సంతరించుటలో ఆ యా ప్రాంతీయులు చెప్పిన ఆ యా ద్రవ్యాలు మున్నగువాటి పేరుల నా చెప్పినట్లే యిందు పొందుపరచి రను కొందును. తెనుగు దేశీయాలు కొన్ని కనుపిస్తున్నవి-గమనించండి: పొట్ట; కంకెలి; ఓంద్ర; నుడికారాలనుబట్టి తిరిచ్చి; కట్టంబిళ ఓ; పిసళ్ళి పదాలు తమిళపువి గాను; హట్టి; హళ్ళాలు కన్నడ పదాలుగాను తోస్తున్నవి. కుట్టి అనే పదం కేరళంలో ఉన్నది. అయితే కేరళంలో ''కుట్టి'' కి గౌరవమైన అర్థమున్నది. ఇక్కడో (ఈ కృతిలో) నీచార్థబోధకంగా ఉన్నది- వేశ్య, కుంటెనగత్తెలని. సంస్కృత వాఙ్మయంలోనూ యిట్లే నీచార్థమే కనుపిస్తున్నది

ఈ హరమేఖల యోగాలను చాల వరకు తెనుగున కనువదించినాను. ఇవి గృహ వైద్యానకూ, గ్రామ వైద్యానకూ అనువైనవని తలుస్తున్నాను.

వాశిరెడ్డి దుర్గాసదాశివేశ్వర ప్రసాద్

ఈ వ్యాసకర్త 1986 మే నెలలో హఠాత్తుగా దివంగతులైనారని తెలుపు టకు విచారిస్తున్నాను. వీరు బౌద్ధవాఙ్మయమంతా సూక్ష్మగా పరిశీలించి ధమ్మ పదము, అవదాన కల్పలతా మొదలైన గ్రంథాలను తెనుగున కనువదించి ప్రచురించినారు. వీరు బౌద్ధ ధర్మోద్బోధములను ఉద్ధరించి తెనుగున రచించి నారు. ఉద్యాన కృషి. వృక్షాయుర్వేదం రచనలు గూడా చేసినారు. అవి అముద్రితములుగానే ఉన్నవి. —వే.శం.శా.

# విషయానుక్రమణిక

## ద్వితీయ పరిచ్ఛేదే

# తృతీయ పరిచ్ఛేదే

## చతుర్థ పరిచ్ఛేదే

## పంచమ పరిచ్ఛేదే

# హారమేఖలా
# సటీకా

## అథ ద్వితీయః పరిచ్ఛేదః

ఖళ ఖుద్ద వఞ్చణా కజ్జ సజ్జణబ్భత్థణావిణిమ + అమ్
కుట్టిణి వరసుహాఁణ విళమ్బణాహి ఆరం ణిసామేహ 1

ఖల (క్షుద్రవఞ్చనా కార్య సజ్జనాభ్యర్థనా వినిమయితమ్)
కుట్టనీ ప్రజుషూ ?... విలమ్బనాధికారం నిశామయత.

ద్వితీయ స్యాధికారస్య రచనే హేతుం ఫలఞ్చ గాథయానయా ప్రతిపాదితమితి.

ద్వితీయాధికార రచనకు హేతువును ఫలాన్ని ఈ గాథ ప్రతిపాదిస్తున్నది.

ఖలులను, క్షుద్రులను వంచించడం, కార్యజ్ఞులైన సజ్జనులను అభ్యర్థించడం, కుంటెనకత్తె (తార్పుకత్తె) సౌభాగ్యాన్ని తక్కువ చేయడం ఉన్న ఈ అధికారాన్ని (అధ్యాయాన్ని) వినండి. 1

సమ ఘుఅ మహు హరిఅ పఈ ప గహిఅ కజ్జ (ళ) విమిస్సిఆ దిణ్ణా,
ఖుట్టిణ కుణఇ ముఇలా మ (అఅ ? హామఅం) జమ్మపేరన్తమ్. 2

సమఘృత మధుభరిత ప్రదీప గృహీత (కజ్జలవి) మిశ్రి (తం ? తా)
ద (త్వా ? త్తా)
కుట్టనీనాం కరోతి షడిరా మహోషధం జన్మపర్యన్తమ్.

---

1. ఈ గాథకు వ్యాఖ్యలేదు. ఛాయకూడ సరిగాలేదు.

తుల్యమాత్రా (భ్యాం) క్షౌద్రఘృతాభ్యాం పూరితో యః ప్రదీపః తతో గృహీతేన కజ్జలేన సంయుక్తః సురాద్యాసవః పానాయదత్తః క్షీణం మహాంతం మదముత్పాదయతీతి.

తేనె, నేయి సమపాళ్లుగా వెలిగించిన దీపంతో చేసిన కాటుక కలిపిన మద్యాన్ని కుంటెన కత్తెలకు తాగనిస్తే, వారికి జన్మపర్యంతమూ మత్తువదలదు.

సమమహు ఘఅ తిమి తిళ భరిఅణాఇం ఖ (ప) దిత్త కత్తిఇ,
కుట్టిణ దేహకాలే కుణస అజ్జం ? (అజ్జ) బ్బణం (బమం) మఇరా 3

సమమధు ఘృత తిమితైల భరిత ప్రదీప కాన్త్యా (కృతయా),
కుట్టనీనాం దీర్ఘకాలం కరోతి మనస్తాపి ? (అజ్జభ్రమం మదిరా).

....పూర్వోక్తద్రవ్యాభ్యాం సమమాత్రేణ మత్స్యేను క్వాథస్నేహేన పూరితస్య దీపస్య సమృద్ధా యే.... సురాద్యాసవ ముక్తం కార్యం కరోతి. అత్ర ద్రవ్యాణి సమమాత్రాణీతి.

తేనె. నేయి, చేపనూనె సమపాళ్లుగా వెలిగించిన దీపంతో చేసిన కాటుక కలిపిన మద్యం కుట్టినులకు చాలకాలం మత్తు కలిగిస్తుంది.

తమ్మాఘఅం సలోణం దసాహమేక్కం వరాహరసఅం వా,
పాఊణ ముఞ్చ (ఇమఅం) ఛాఅచ్ఛీరం వ ణాసాఇ. 4

తామ్రా ఘృతం సలవణం దశాహ మేకాహం (వా ? వరా) హరసకం వా
పీత్వా ముఞ్చతి మదం ఛాగ క్షీరం వా నాసికయా.

పూర్వోక్త భాగద్వయేనారభ్య మదనేన ప్రయోగత్రయేణ నివర్తతే. తామ్రా గోఘృత సైంధవ సంయుక్త మథవా ఛాగక్షీరం దశదినాని నస్యేనోప యుజ్యేత ఇ(త్య)ర్థః.

రాగిరంగు ఆలపాలు సైంధవలవణంతోపాటు పదిరోజులు సేవించినా, నేలతాటిగడ్డ రసం ఒకరోజు సేవించినా, మేకపాలు నస్యంచేసినా ముందు చెప్పిన ప్రయోగాలవల్ల కలిగే మత్తు వదలుతుంది.

ధవళహయమార మూలం రమ్భాకుసుమాఇ బిళఇహళ మజ్జా,
దిణ్ణో భోఅణ సమఏ ఖళకుట్టణీ అణ(ం) వమఇ. 5

ధవల హయమార (మూలం రంభాకుసుమాని) బిల్వదళమజ్జా,
దత్తో భోజనసహితం ఖల కుట్టనీ జనం వమయతి.

శ్వేతస్య హయమారస్య కరవీరస్య మూలం. రమ్భా కదలీ తత్పుష్పాణి బిల్వ మజ్జా చ ఏతత్సంయుక్త భోజనేన సహ దత్తం ఛర్దయతీతి.

తెల్ల గన్నేరు వేళ్ల, అరటిపూవు, మారేడుకాయ గుజ్జు కలిపి నూరి భోజనంలో కలిపి దుష్టురాండ్రయిన కుంటెనకత్తెలకు ఇస్తే వాంతులు కలుగుతాయి.

సరకేణ వ పాణేణ వ దిణ్ణం తమ్బోళమీసిఅం అహవా
కంగుష్ఠం అవిణఅ కుట్టణీఓ దిఅహే విరేఏఇ. 6

సరకేన వా పానేన వా దత్తం తామ్బూల మిశ్రితం అథవా,
కఙ్గుషం (స? అ) వినయకుట్టనీ (ది? ర్ది) వసే విరేచయతి.

సరక ఇకృత్రిమ మద్యాది. పానం కృత్రిమ సురాది. కాఙ్గుషం తిక్తదగ్ధికా శిష్టం స్పష్టం.

చెరకు సారాయివంటి వండని మద్యాలలోగాని, వండిన మద్యాలలో గాని, తాంబూలంలోగాని కంకుష్ఠాన్ని దుర్మార్గురాండ్రయిన కుట్టినులకు ఇస్తే పగలంతా విరేచనాలు పట్టుకుంటాయి.

ఛీరళిళ దుద్ధ మీసిఅ రోహిఅ పిఏహి (?)

(ఛీరళిళ ? క్షీరవల్లీ) విమిశ్రిత రూషికా బీజైః
గులసనాథైః భవతి రుధిరాతిసారః

ఖాదనేన వా దత్తైః క్షీరవల్లీ సుధాక్షీరాత్ క్షీరేణవిమిశ్రితేన రుధిరకస్యార్క
వృక్షస్య బీజైర్గులసంయుక్తైః. శిష్టం స్పష్టం.

జెముడు పాలతో కలిసిన జీడిగింజ విత్తులను బెల్లంతోపాటు ఇస్తే రక్త విరేచనాలు కలుగుతాయి.

పసాద క త్తి ణిహి త్తే తమ్మోలే ఖుట్టి ణీణం ముహరోఓ
తా హోఇ జా ణ ముచ్చఇ విభవడ్డిఅ హిఅఅ పరిఓసె 8

స్థూల కృకలాస కృత్తి నిహితే తామ్బూలే ఖట్టనీనాం ముఖరోగః,
తావ ద్భవతి యావత్ న ముచ్యతే విభవర్ధిత హృదయపరితోషః.

సరలః కృకలాసః (శబ్దో విశేషణే తచ్చర్మణి యదీయా స్తామ్బూలపీటా నిబద్ధాస్తే తస్య తావన్ముఖరోగో భవతి యావత్పునర్న ముచ్యతే. (యుక్తేతు న? ముక్తే తు) నివర్తత ఇతి.

పెద్ద తొండ చర్మంలో పెట్టిన తాంబూలం కుంటెనకత్తెలు నోట్లో పెట్టుకుంటే నోటిపుండు కలుగుతుంది. ఇది సరసుల హృదయానికి ఎంతో సంతోషం కలిగిస్తుంది. ఈ తాంబూలం నోటిలో ఉన్నంతవరకు మంటపుడుతుంది, తీసివేస్తే మంట ఉండదు.

భళ్ళాఅఅ కత్థ కరణ్డఅమ్మి ఆమేళపూరిఏ జస్సహ (?),
అహివఅణే వ ణిహిప్పఇ ముహరోఓ తస్స సంభవఇ 9

భల్లాతక కాష్ఠ కరణ్డకే ఆవేతపూరితే యస్య,
అహివదనే వా నిధీయతే ముఖరోగ స్తస్య (స?) సమ్భవతి.

భల్లాతకస్యారుష్కరస్య సమ్పుటి(నో) దారుణః సమ్పుటియత్ సముద్గాతత్రి ఘృత (ధృతం) సర్పముఖే వా యస్య సమ్పుటి తన్మాలా పీడా ధారా సపీడః పత్రికాధటక (?) ఇది పత్రిసిద్ధో నిక్షిప్యతే తస్య ముఖరోగో జాయతి ఇతి.

జీడి కర్రతో చేసిన పెట్టెలో పెట్టిన తాంబూలం బీడాగాని, పామునోట్లో పెట్టి తీసిన బీడాగాని నోట్లో వేసుకున్నవారికి నోటిపుండు కలుగుతుంది.

వగ్గలి వఅణ ణిహి త్తే తంబోలే వేరిణో మహా ఘోరో,
ఘోఅస ముహ విమ్భాదే దన్తధావణే హోఇ ముహరోఓ. 10

వల్గులి వదన నిహితే తామ్బూలే వైరిణో మహాఘోరః,
గోన (సముఖవి) న్యస్తే దన్తప(?) (ధ)వనే భవతి ముఖరోగః.

వల్గులి శ్చర్మ శకునిః. వృక్షదంతలే కృచిత్రృసిద్ధః తన్ముఖే యదీయ స్తామ్బూలాపి (వీ)టో న్యస్యతే తస్య ముఖరోగో భవతి. తథా గోనాసముఖే యచ్చర్విత్రం దన్తధావనం న్యస్యతే తస్యా ముఖరోగో జాయత ఇతి.

వల్గులి (ఒక విధమైన గబ్బిలం) ముఖంలో పెట్టి తీసిన తాంబూలం బీడా శత్రువులకిస్తే వారికి ఘోరమైన నోటిపుండు వస్తుంది. గోనసమనే పామునోట పెట్టిన పలుదోము పుల్లను వాడినా ఘోరమైన నోటిపుండు పుడుతుంది.

కణఅ సిహి శిమ్మిఅ మహుఅర ధూమాఊరిఅ కుటోఅర ణిహిత్తమ్,
కుణఇ జళం దిణ్ణం కుట్టిణీణ మోఅతణ మసజ్ఞమ్. 11

కనకశిఖి నిర్మిత మధుకర ధూమాపూరిత కుటోదరన్యస్తమ్,
కరోతి జలం దత్తం కుట్టనీనాం మూకత్వ మసాధ్యమ్.

కనకో మాతులుఙ్గమ్. తత్పృష్ఠ జన్మోపరి నిక్షిప్తభ్రమర శరీరజేన ధూమేనా పూరితస్య ఘటస్యకుక్షౌ నిక్షిప్తం యజ్జలం తత్ పీత మసాధ్యం వాగ్వైకల్యం కరోతి.

నిమ్మకర్రల నిప్పుపై వేసిన తుమ్మెదల పొగ నింపిన కుండలో పోసిన నీరు తాపితే కుంటెనకత్తెలకు అసాధ్యమైన మూగతనం వస్తుంది.

మాళఇ పసూఅ కఅఆవాస కుమ్భ పరివసిఅ సళిళమ్,
సుప్పసఇ సోఅత్తణమ్మిణమో ద్ధుద్ధరం పి సత్తాహమత్తేణ. 12

మూలంలో దీని ఛాయలేదు.

(మాలతీప్రసూన కృత వాస కుమ్భ పరివసిత సలిలమ్,
.............................దుర్ధరం మపి సప్తాహ మాత్రేణ)

మాలతీ ప్రసూనాని సుమనః పుష్పాణి తైఃకృతాధివాసో యో ఘటః తత్సలిలంజలం సూత్రపర్యుషితం రాత్రిమేకాం స్థితిం మదిలి (?).

మాలతి పూవులు నింపి దాని వాసనతో వాసితమైన కుండలోని నీళ్ళు ఒక వారం మాత్రం సేవించినా....

చణ (ఖ? ఏ) హి సమం ఖఇఅ పాఉం దిణ్ణఇ్ప సేఅజలేణ,
అహ కుణఇ కుట్టిఅ కుట్టణేణ కడిపవణమ్ (అహిముహరమ్). 13

చణకై స్సమం ఖాదితా పాతుం దత్తా వాసిత జలేన,
అథ కరోతి కుమ్భికా కుట్టనీనాం కటిపవన మతిముఖరమ్.

కుమ్భికా ఓషధి విశేషః.

కుమ్భికను (వారిపర్ణిని) సెనగలతోపాటు తిన్నా, కుమ్భిక ఊరవేసిన నీటిని తాగినా కుంటెనకత్తెకు పెద్దపెద్ద అపానవాయువులు కలుగుతాయి.

మా + ల్ల జే భమన్తి సళిళోవరి ముడపుళ్ళ అ(?),
కసణా భసగల్ల అచ్ఛ తారుఅ ఇత్తి పసిద్ధిఆ. 14

ఇక్కో కీడో ళ్ళఆణ తాణఅ ముణ్డిఅ దేహాట దిణ్ణో,
సహ మణ్ణఇణ (?) కడిమారుఅ ఙ్ఞాపట. 15

అతి త్వరితం యే భ్రమన్తి సలిలస్యోపరి సూక్ష్మాః,
కృష్ణా భ్రమరా ఇవ తారుకా ఇతి ప్రసిద్ధాః.

ఏకః కీటానాం తేష్యాం మూర్ధ్ని కృతదేహో దత్తః,
సహమూర్ధ్నేన కటిమారుతో ఏకః (?).

యే లఘుప్రమాణాః కృమి విశేషాః జలస్యోపరి చతురం కృత్వా కృష్ణ వర్ణాః భ్రమన్తి తేషాం మధ్యాదేకః సుపిష్టశరీరస్తాంబూలరాగే దత్తః పూర్వోక్తం కార్యం కరోతి.

నీటిపైన బాల సూక్ష్మమైన కృములు తేనెటీగలలాగ అతివేగంగా తిరుగుతుంటాయి. వాటిని 'తారుక' అని అంటారు. అవి నల్లగా ఉంటాయి. వాటిలో ఒకదానిని నలిపి తాంబూలంలో ఇస్తే అపానవాయువులు ఎక్కువగా పుడుతాయి.

సర డిన్ద్నిర విఞకపుఅ చుణ్ణ భిక్కేసు హో౯ఇ అఙ్గేసు,
ఖళ కుట్ట కిణ కుట్టం సవే ఖణం కణ్ణు సఞ్జాతమ్. 16

సరడి (సరటే) న్దిన్దిర వృశ్చిక చూర్ణ స్పృష్టేషు భవత్యఙ్గేషు,
ఖలకుట్టనీనాం కుష్ఠం సవేదనం కణ్ణు సంయుక్తమ్.

కృకలాస భ్రమర వృశ్చికానాం శరీరచూర్ణేన యస్య గాత్రం లిప్యతే తస్య యథోక్తం కార్యం కరోతి కుష్ఠం జనయతీతి.

తొండ, తుమ్మెద, తేళ్ళను చంపి ఎండబెట్టి వాటి చూర్ణాన్ని దుష్టులైన కుట్టనుల ఒంటిపై చల్లితే, వారికి దురదలతోపాటు కుష్ఠురోగం వస్తుంది.

ఫణినో ఘరగోహాఇవ ముహమ్మి సత్తాహసణ్ఠిఆ గుఞ్జా,
ఖఇఆ జణేఇ కుట్ఠం చార జఇ న్న సముప్పసఇ. 17
ఫణినో గృహ గోధాయా ముఖే సప్తాహ సంస్థితా గుఞ్జా,
ఖాదితా జనయతి కుష్ఠం చారం (జనం) తత్సముత్పంసయతి.

గుఞ్జ రక్తికాం సర్పస్య ముఖోదరే వా గృహగోధాయా వా కుటమత్సః ఇతి ప్రసిద్ధః కృమివిశేషస్తువా, ముఖే సప్తమాత్రాణి దినాని నిక్షిప్తా (ఉ? భు) క్తా సతీకుష్ఠం జనయతీతి తత్ కుష్ఠం చారస్య ప్రియా ఇదమస్యఫల.... ఉపయుక్త (?) సన్నిధారయతీతి.

పామునోటగాని, ఇంటి బల్లినోటగాని వారంపాటున్న గురివిందగింజను తింటే కుష్ఠు కలుగుతుంది. అది దగ్గర ఉండడంవల్ల చారులకు ఇది చాలా ఇష్టమైనది ఉపయోగకరమైనది. ఇతరులు దూరంగా తొలగిపోతారు.

సిద్ధత్థా అహిముహమ్మి క(ద్ద)మ కిఅ పరివారఇప్ప పేక్కా,
ణిధూమ ధోరి దారు సముబ్భవ జళఏణ నిక్ఖిత్తా. 18

సఅణ అళ పిప్పం సముగ్గ ఆపోప్పడుఆ,
ఖళకుట్టి(టీ) అణం ఖపిత్తి కద్దమ పరిఅర రహిఆ. 19

సిద్ధార్థా అహిముఖే కర్దమ కృత పరివారకే పక్వే,
నిర్ధూమ కదలీదారు సముద్భవ జ్వల(న) నిక్షిప్తాః.

శయనతలే స్పర్శ సముద్గత స్ఫోటకామ్ (న్),
ఖలకుట్టనీజనం క్షపయన్తి కర్దమ పరీవార రహితాః.

సిద్ధార్థాః సర్షపాః సర్వస్య మృష్టత్వాదయస్తం ? క్షపయన్తియది పఙ్కనాసౌ సర్వాఙ్గీణకృత (కృత?) పరికరే దత్తలేపో భవతి. తస్మిన్ దత్తకృతస్య (?) స్ఫోటాః శామ్య న్తీతి యుగలకమ్.

పాముపోట నానిన ఆవాలను పొగలేని అరటిదూట నిప్పులోవేసి దుర్మార్గులైన కుంటెనకత్తెల పక్కలకు ధూపం వేయాలి. ఆ పక్కలను తాకగానే కుంటెనకత్తెల శరీరంపై దద్దుర్లు లేస్తాయి. ఒంటికి బురద రాచుకుంటే దద్దుర్లు తగ్గుతాయి.

భల్లాదఅరస కవికచ్ఛుఅ రోమహి జీఅహర జళణ గుఞ్జ, హి,
ఛిక్కమ్మి హోఇ అంగే జూఆ ఖరదినఅరే కాళే. 20

భల్లాతక రస కపికచ్ఛుకి రోమ జీవహర జ్వలన గుఞ్జాభిః,
స్పృష్టే భవత్యఙ్గే లూతా ఖరదినకిరే కాలే.

భల్లాతకమ్ అరుష్కరమ్. కపికచ్ఛుకోమాణ్యాత్మగుప్తాపర్ణాని, జీవహారం విషమ్ జ్వలనః చిత్రకః గుఞ్జా రక్తికా ఏతైః ద్రవ్యైః సమైఃకృతేన చూర్ణేన స్పృష్టేఽఙ్గే గ్రీష్మకాలే లూతా జాయన్తే ఇతి.

జీడిగింజల రసం, దూలగొండి ఆకులు, విషం చిత్రమూలం, గురివింద గింజలు సమపాళ్లుగా చేసిన చూర్ణంతో ఎండకాలంలో ఎవరినైనా తాకితే, వారి శరీరంలో సాలెపురుగుల వంటి దద్దులు పుడుతాయి,

తత్ప్రత్యానయన మాహ —

సా ధారితం ణ జీవఇ సామా రుణ మళఅ చన్దణ తగరేహి,
(కుష్ఠోశీరాహి) విజూఅ(?) పసరన్తి మన్తసహిఏహి. 21

సా ధారయితుం న పార్యతే జీవతి?) శ్యామారుణ మలయచన్దన తగరైః
కుష్ఠోశీరాభ్యాం పీనాః (?మపిన, ప్రసరన్తీతి మన్త్రసహితైః.

సాలూతాః ప్రసరన్తీతి వర్ధమా(?) వారయితుం న శక్యతే వక్ష్యమాణ మన్త్రసహితైరేతైర్ద్రవ్యైర్వినా తైః. శ్యామా గంధప్రియంగుః. అరుణం కుఙ్కుమం. మలయం చన్దనం. చన్ద్రః కర్పూరః. తగరం జిహ్మమ్. కుష్ఠమ్ వాప్యమ్. ఉశీర మభయమ్ ఏతైర్లేప పానాదినా ప్రయుక్తం నివర్తతి ఇతి. మన్త్రోయథా 'ఓన్నమ ఉద్దామేశ్వరాయ కుహరి కున్దరి ఠఠ'. ఏతే(న)మన్త్రేణాభిమన్త్రి తాని శ్యామాదీని పూర్వోక్తప్రయోగోత్పన్నాయా లూతాయా నివారణ మిత్యర్థః.

ప్రియంగు, కుఙ్కుమపూవు, కర్పూరం, గ్రంధి తగరం చెంగల్వకోష్ఠు, వట్టివేరు, వీటిని నూరి ఒంటికి లేపనం చేయడంవల్లగాని, పానీయంగా పుచ్చుకోడం వల్లగాని ఈ దద్దులు అణగిపోతాయి. ఈ లేపనాన్ని, పానీయాన్ని 'ఓన్నమ ఉద్దామేశ్వరాయ కుహరి కున్దరి ఠఠ' అనే మంత్రంతో అభిమంత్రించాలి.

సరళ స్సాహిపఇస్స వ సోణిఅరత్తమ్మి లంఘిఏ సుత్తే,
మహిళాణ గళఇ రుహిరం పిచ్ఛోఇయఅ ళంఘిఏ ఠాఇ. 22

సరలస్యా హిపతేర్వా శోణితరక్తే లఙ్ఘితే సూత్రే,
మహేలానాం గలతి రుధిరం ప్రక్షాలితే లఙ్ఘితే తిష్ఠతి.

సరలస్య కృకలాసస్య అహిపతేః శోణితేన రుధిరేణ రక్తే లిప్తే సూత్రే లఙ్ఘితే సతి మహేలానాం లఙ్ఘయిత్రీణాం శోణితం గలతి రజః స్రవతి. తస్మిన్ పూర్వ ప్రక్షాలితే తతో లఙ్ఘితే తద్ రక్తం తస్యా నిరుధ్యత ఇత్యర్థః.

తొండరక్తంలోగాని, పాముర క్తంలోగాని తడిపిన దారాన్ని దాటితే స్త్రీలకు ఋతురక్తం తెరపిలేకుండా స్రవిస్తుంది. దానిని కడిగివేసి మరల ఆ దారాన్ని దాటితే స్రవించడం ఆగిపోతుంది.

వణమూసఅ ఖళ్ళా విణిహిమ్మి కఇతన్తి గాఢ బద్ధమ్మి,
ఖుట్టీణ మళణిరోహో (హో) ఇ పురీసమ్మి హట్టి సహ. 23

వన మూషికా చర్మ నిపీడితే కపితన్త్రి గాఢబద్ధే,
కుట్టనీనాం మలనిరోధో భవతి పురీషే ...

తస్మిన్ గచ్ఛతి సమమితి నివర్తత ఇతి (?). 23

అడవి ఎలుకల చర్మంతో నలిపిన కోతి నరాలను కుంటెనక త్రెంచేతికి కడితే వారికి మలబంధం ఏర్పడుతుంది. దానిని తొలగిస్తే మలబంధం తొలగుతుంది.

గోసళిళ పిట్ఠ వగ్గులి మళ లిత్త సరావ థఇఅ వచ్చస్స,
ఐవాస్య మళనిరోహో హోఇ మహాదుఃఖ సజ్జననో. 24

గోసలిల పిష్ట వల్గులి మలలిప్త శరావ స్థగిత వర్చస్కస్య,
వైరిణో మలనిరోధో భవతి మహాదుఃఖ సజ్జననః.

గోమూత్రేణ పిష్టం వల్గులే స్సరు చర్మశకునేః పురీషం తేన లిప్తం యచ్ఛరావం తేన స్థగితం వర్చో యస్య తస్య తీవ్రవ్యథో మలనిరోధో భవతి. శరావాపాసనేన నివర్తత ఇతి.

ఆవు పంచితంతో వల్గులి (ఒకవిధమైన గబ్బిలం) మలాన్ని కలిపి ఒక మూకుడుకుపూసి, ఆ మూకుడును శత్రువు మలంపై మూసిపెడితే, అతనికి తీవ్రబాధాకరమైన మలబంధం ఏర్పడుతుంది. మూకుడును మలంపైనుంచి తొలగిస్తే మలబంధం తొలగుతుంది

తరు దేవకులాళయ చమ్మసఉణి మళలిత్త మళ్లఅ ణిరుద్ధే,
హోఇ పురీసమ్మి ఫుడం రిఉణో మళమారుఅ నిరోహో. 25

తరు దేవకులాలయ చర్మశకుని మల లిప్త మల్లక నిరుద్ధే,
భవతి పురీషే స్ఫుటం రిపో ర్మల మారుత నిరోధః.

వృక్షే దేవకులేవా యశ్చర్మశకునిః సనీళో నివసతి తస్య సమ్బన్ధినా శకృతా లిప్తేన శరావేన నిరుద్ధం స్థగితం యస్యమలం స్థాప్యతే తస్యదుస్సహవ్యథో మల నిరోధో భవతి తన్ముక్తౌ గ్రంథౌ స నివర్తత ఇతి.

చెట్లపైగాని, దేవాలయాలలోగాని నివసించే చర్మశకుని (ఒక విధమైన గబ్బిలం) మలం పూసిన మూకుడుతో శత్రువు మలాన్ని మూసిపెడితే, ఆ శత్రువుకు మలం, అపానవాయువు ఆగిపోతాయి. మూకుడును తీసివేస్తే మల బంధం తొలగుతుంది.

తాళహడ క_త్తి ణిక్షి_త్త ణివిడ సణ్ణమిఅ ము_త్త పఙ్క్ణ,
ఖలకుట్టణీ కిళమఇ మో_త్త ణిరోహాఉళా సుఇరమ్. 26

తాలహడ కృ_త్తి నిక్షి_ప్త ని (మి?బి) డ సంయమిత మూత్రకర్దమా, (?)
ఖలకుట్టనీ క్లామ్యతి మూత్ర నిరోధాతురా సుచిరమ్.

తాలహడస్య వనమూషికస్య చర్మణి దృఢబద్ధో మూత్రరజః పఙ్కో యస్యాః స మూత్రనిరోధాతురా క్లాన్తా భవతీతి.

అడవి ఎలుక చర్మంలో కుంచెనక_త్తెలు మూత్రించిన తడిమట్టిని మూటకట్టిపెడితే, వారు మూత్రం బిగుసుకొని చాలా బాధపడతారు.

రిట్టణ్డఅ రసగుత్థిఅ మల్లఅ థఇఅమ్మి హిణ్డఇ పురీసే,
ణహ చఞ్చు హణణ పావడ వా అ(స) ణి(ఉ)రుంబ ఖజ్జన్తో. 27

రిష్టాణ్డక రస రూషిత మల్లకస్థగితే హిణ్డతి పురీషే,
నఖ చఞ్చు హనన వ్యాపృత వాయస నికురుమ్బ ఖాద్యమానః.

రిష్టః కాకః. తదణ్డాన్తర్వ_ర్తినా రసేన కలలేనాక్షిప్తో యః శరావః తేన స్థగితం పురీషం యస్యస (సవే?) హిణ్డతి వ్రజతి. నఖచఞ్చు ఘాతవ్యగ్రైః భక్ష్యమాణో భవతీతి.

శత్రువు పురీషాన్ని కాకిగుడ్డుసొన పూసిన మూకుడుతో మూసినట్టయితే, ఆ శత్రువును కాకుల గుంపు కాళ్ళతోను, ముక్కుతోను పొడిచి తింటాయి.

లిహిఊణ జ(ణ?)స్స ణామం చూఅదళే కసణ రిట్ఠ రుహిరేణ,
కీరఇ పురీసమజ్ఝే సో ఖజ్జఇ కాకణివహేణ. 28

లిఖిత్వాయస్య నామ చూతదలే కృష్ణారిష్ట(క?) రుధిరేణ,
క్రియతే పురీషమధ్యే స ఖాద్యతే కాకనివహేన.

యస్యార్ద్ర(మ?)పత్రే కృష్ణవాయసర_క్తేన నామ లిఖిత్వా తత్పత్రం శకృన్మధ్యే స్థాప్యతే సకాకిసఙ్ఘైర్భక్ష్యత ఇతి.

శత్రువు పేరును మామిడాకుపై కాకిరక్తంతో వ్రాసి దానిని అమేధ్యంలో వేస్తే, ఆ శత్రువును కాకులగుంపు పొడిచి తింటుంది.

విచ్ఛుఅ కణ్ణఅ మహిఏ మఅణఫలా న్తరిఅ విణిహిఏ హోఇ,
విసమం పర(హాఙ్గ) దుఃఖం మహిళాణం ముత్త చిక్ఖిల్లే. 29

వృశ్చిక కణ్టక సహితే మదనఫలేఽన్తర్వినిహితే భవతి,
విషమం వరాఙ్గ దుఃఖం మహేలానాం మూత్రకర్దమే.

స్త్రీణాం స్వమూత్రోత్పన్నే పఙ్కే ఏవం విధేక్రియమాణే దుఃసహా యోనివేదనా భవతి. కీదృశే. వృశ్చికస్య సమ్బన్ధి యత్కణ్టకం యేనాసౌ దశతి తత్సంయుక్తే మదనఫలస్యాన్తర్నిక్షిప్త ఇతి.

ఉమ్మెత్తకాయలో తేలుకొండిని పొదిగి, ఆ కాయను శత్రుస్త్రీ మూత్రించినచోట పాతితే, ఆ స్త్రీ మర్మాంగంలో తీవ్రమైన నొప్పి కలుగుతుంది.

విచ్ఛుఅ కణ్డఅ విద్ధం ఖలకుట్టణి పురిస మద్దఅ సణాహమ్,
కుణఇ కుసార ణిహిత్తం వరాఙ్గ దుఃఖం మహాఘోరమ్. 30

వృశ్చిక కణ్టక విద్ధం ఖల కుట్టనీ పురీష మార్ద్రిక సనాథమ్,
కరోతి భూతల గర్భ నిహితం వరాఙ్గ దుఃఖం మహాఘోరమ్.

స్త్రీణాం పురీష మేవం క్రియమాణం తాసామేవ ఘోరాం యోనివ్యథాం కరోతి. కథం క్రియమాణమ్, వృశ్చిక కణ్టకేన విద్ధం తథార్ద్రకేణ సనాథం తాదృ(శేనశం) సద్ భూతల గర్భన్యస్తమితి. ఖల శబ్దః కుట్టనీ విశేషణమ్, స్త్రీ విషయత్వాత్ ప్రయోగస్య.

దుర్మార్గురాలైన కుట్టని పురీషాన్ని తేలుకొండి, అల్లంతోపాటు భూమిలో పాతిపెడితే, ఆ కుట్టనికి మహా ఘోరమైన యోనిబాధ కలుగుతుంది.

ద్విజ డోమ్బ కాఅ కోసిఅ కఇ మజ్జర ఛాఅ ణఉళ రోమేహి,
పచ్ఛాఇఏ పురీసే రిఉణో సమ్భవఇ ఉమ్మాఓ. 31

ద్విజ డోమ్బ కాక కౌశిక (కపి) మార్జారద్వాగ నకుల రోమభిః,
ప్రచ్ఛాదితే పురీషే రిపోః సమ్భవత్యున్మాదః.

